JAGATI Rs. 2-00 December 1991

37th Year of Publication




4 2 5

డిసెంబరు - 1991

## సాహితీ సుధ

శాణ విమృష్ట రత్నము న శస్త్రహతుండగు శూరుడున్ మద
క్రీణ గజంబు సైకతవిశిష్ట శరన్నదియు నవక్షపా
ప్రాణవిభుండు చండసుర తాలన బాలికయున్ ధీనైక వి
శ్రాణన్ శూరులుం గడు గృశత్వమనం బ్రభ గాంతు రిద్దరన్

—భర్తృహరి



పూనిన భాగ్యరేఖ చెడిపోయిన పిమ్మట నెట్టి మానవుం
డైనను వాని నెవ్వరు బ్రియంబున బల్కరు పిల్వ రెచ్చటం
దానది యెట్లుకో యనిన దథ్యము పుష్పము వాడి వాసనా
హీనత నొంది యున్న యెడ నెవ్వరు ముట్టుదురయ్య భాస్కరా

—భాస్కర శతకం



ఒడలు బిగిసి కొనిన యోగి వేషంబగు - మనసు కల్మషంబు మానుటెట్టు
పుట్టమీద గొట్ట భుజగంబు చచ్చునా - విశ్వదాభిరామ వినురవేమ

—వేమన



'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00 - జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలలో పాట్రన్ రు. 2000-00

ముఖచిత్రం : మన్మోహన్ సింగ్

# నిమ్మ తొనలు

 

విమలాదేవి, సూర్యారావు పార్కులో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

'నాకో విషయం సందేహంగా ఉంది' - అన్నది విమల.

'దేనిగురించి ?' అని ప్రశ్నించాడు సూర్యారావు.

'నీది నిష్కళంక ప్రేమ అవునా కాదా అని.'

'నా ప్రేమ ఎన్నటికీ చెరగనిది, మాసిపోనిది, నిత్య నూతనమైనది.'

'మాటల కేముంది, నమ్మడ మెలా ?'

'నీకంతగా నమ్మకం కలగపోతే జానకి నడుగు....'

(సూర్యారావు పాత ఫ్రెండ్ జానకి)

—యమ్ సోమ శేఖర్
అమలాపురం

బజార్లో ఎదురుపడ్డ సుబ్బారావుని ఆపి మరీ చెప్పాడు రామ్మూర్తి.

'మా వాడిప్పుడు చాలా పై అంతస్థులో ఉన్నాడు.'

'మంచిదే కద ! యువకులు వృద్ధిలోకి వస్తేనే దేశానికి ప్రగతి, ఇంతకీ ఏ ఊళ్లో పోస్టింగ్ ?' - అడిగాడు సుబ్బారావు.

'ఈ ఊళ్లోనే'

'ఏ కంపెనీ ?'

'ఈ మధ్య కొత్తగా కట్టిన గిరిజా ఇంటర్నేషనల్ హోటల్ అయిదో అంతస్థులో రూమ్‌బాయ్,' అని గర్వంగా చెప్పాడు రామ్మూర్తి.

—పియమ్ సుందరరావు
విజయవాడ-8

కొత్తగా ప్రారంభించిన కాన్వెంట్ లో పిల్లలకి సీటు యిచ్చేముందు తలిదండ్రులని పరీక్ష చేయడమనే నియమం పెట్టుకున్నారు.

బెల్ కొట్టి, అటెండరుతో 'నెక్స్ట్' - అంది ప్రిన్సిపాలు.

సుజాతా, రాఘవరావు బిక్కు బిక్కుమంటూ ప్రవేశించారు.

'అమ్మా మీరెంతదాకా చదువుకున్నారు ?' - అని ప్రశ్నించింది ప్రిన్సిపాలు, సుజాతని.

'బిఏ, హోమ్‌సైన్స్ పాసయానండి.'

'మీ వారు ?'

'ఎమ్ఏ మాథ్స్ పాసయాక, నాలుగేళ్లగా ఒక 'ఫరమ్'లో మేనేజరు' - అంది సుజాత.

'మీరు బిఏ, మీవారు ఎమ్ఏ - అంతేగా ?'

'అవునండి'

'అయితే, మీ అబ్బాయికి మా కాన్వెంట్‌లో సీటు యిస్తాం. మీ యిద్దరూ కలిసి హోమ్‌వర్క్ చేసి పెడతారు.'

—ఎమ్‌పి వరప్రసాదరావు
ఇబ్రహీమ్ పట్నం

'ఏమయ్యా కనకారావ్, భలే హుషారుగా ఉన్నావు. ఏమిటి కథ ? అత్తవారు స్కూటరు కొనిపెడతామన్నారా ?' - అడిగాడు ఆఫీసరు.

'నా కటువంటి దురాశలు లేవండి.'

'మరి ఎందుకా హుషారు ?'

'మా ఆవిడ పుట్టింటికి వెళ్లిందండి.'

'ఒక్కడివీ వుండాలని దిగులు పడటం పోయి, ఈ సంతోషం దేనికి ?'

'మా ఆవిడ వంట నుంచి విముక్తి కదండి పదిహేను రోజులపాటు హాయిగా హొటల్ భోజనం' - అన్నాడు కనకారావు.

—యమ్ శ్రీనివాసరావు
ఫిరంగిపురం

'పేరయగారూ మీరు తెచ్చిన సంబంధం అన్నివిధాలా బాగానే వుంది. అమ్మాయి చక్కనిచుక్క అంటున్నారు ; కుందనపు బొమ్మ అంటున్నారు ; ఈడూ జోడూ కుదురుతుందంటున్నారు. అవన్నీ సరే - యింతకీ ఆ అమ్మాయి ఏమైనా ఉద్యోగం చేస్తున్నదా ?' - అబ్బాయి తండ్రి సత్యనారాయణ అడిగాడు.

'అల్లికలూ కుట్లూ వచ్చు. గృహకృత్యం బాగా తెలుసు. కీర్తనలు పాడుతుంది ; వీణ వాయిస్తుంది'.

'అవన్నీ సరేనయ్యా బాబూ ! ఆ అమ్మాయికి ఉద్యోగం ఉన్నదా లేదా? - అదీ ముఖ్యం. మావాడు ఎమ్‌కామ్ పాసై నాలుగేళ్లయింది. కనీసం సేల్స్‌మాన్ జాబ్ కూడా దొరకడం లేదు. ఆ అమ్మాయికైనా ఉద్యోగం లేకపోతే రేపు వీళ్లు ఎలా బతుకుతారు ?'

కాలం ఎలా మారిపోయిందని విస్తుపోతున్న పేరయ్యగారితో 'ఉద్యోగంచేసే పిల్లని చూడండి' - అన్నాడు సత్యనారాయణ.

—యస్‌టిపి శ్రీదేవి
విజయవాడ-13







# పాఠకుల తీర్పు



చందూర్ గారికి: నమస్సుమాంజలి. స్నేహపరిమళాలను వెదజల్లుతూ, చేతిలోవాలిన 'జగతి' పుటలను తిరగేస్తుంటే ఓ మంచి మిత్రునితో మనసార కబుర్లాడుతున్నట్లుంటుంది. ఆ హొమ్లీనెస్ బహుశా మీ అభిరుచుల ప్రతిబింబం కావచ్చు. అవునా !.... మాలతి గారెలా వున్నారు? అడిగానని చెప్పండి. 'వనిత'లో వోల్గాతో ఆమె సంభాషణ దీటైన ప్రశ్నకు ఘాటైన జవాబులా వుంది – కంగ్రాచ్యులేషన్స్ .... హైదరాబాదు ఎప్పుడు వస్తున్నారు? ఈసారి వచ్చేముందు నాకు తప్పక తెలియజేయండి. చాలా రోజులయింది - మీ ఇద్దర్నీ చూడాలనివుంది.... శుభాకాంక్షలతో.

—కె యస్ లక్ష్మి
హైదరాబాదు-482

చందూర్‌గారికి; నమస్కారములు. బెంగుళూరు కాంప్ నుంచి, చీరాల కాకినాడల మీదుగా స్వగ్రామం చేరాక, భారత ప్రధాని గౌ॥ శ్రీ పివి ముఖచిత్రంగా గల 'జగతి' చూసి ఆనందించాను.... తల్లావ్రగడ ప్రకాశ రాయడిగారి 'నా ర్నాట చక్రం' మిమ్మల్ని ఆకర్షించడం, సంక్షిప్త భాగాల ప్రచురణ మొదలెట్టటం. మీరు చేస్తున్న ఒక సత్కార్యంగా భావిస్తున్నాను. ఆ గ్రంథ ప్రాశస్త్యము ఎంతో ఘనమైనదని నా నమ్మకము. ఆ మహానుభావునిలోని గొప్పదనము సాటిలేనిది.

—ఎమ్
వొమ్మంగి

యన్నార్ చందూర్‌గారికి: నమస్కారములు. ఉభయకుశలోపరి... జులై నెలలో ఆ సాయింత్రం మీ దంపతులతో గడిపిన సమయం అమూల్యమైనది, తులలేనిది. కవిత్వం గురించి మీరు చెప్పిన విషయాలు అమృతోపమానాలు. నా రచనలలో మీ సూచనలను పాటించాలని నిర్ణయించుకున్నాను. మీ ఇరువురి దగ్గర నేను తెలుసుకున్న విషయాలను ఇక్కడ సాహిత్య సభలో మిత్రులకు వివరించాను.... తమిళనాడు సాహిత్య పర్యటన చక్కగా జరిగినది. మీరు చెప్పిన రచయితలు కొంత మందిని కలుసుకున్నాను – ఎన్నో విషయాలు వారి నుంచి గ్రహించాను... మన సాహితీ సంస్కృతులకు 'జగతి' ఒక ఆభరణం. మీ ఆదర్శదంపతుల సృహృదయ వినయమూర్తిమత్వము నన్ను ముగ్ధుణ్ణి చేసింది.

—చిత్రకవి ఆత్రేయ
విశాఖపట్నం-12

# వెన్నెల కెరటాలు



## వియల్ దత్

గ్రామాలు చెందితేనే దేశం చెందుతుందని, గ్రామాభ్యుదయం కోసం ప్రతి ఒక్కరూ పాటుపడవలసిన అవసరం ఎంతైన ఉన్నదని విశ్వసిస్తారు శ్రీ లక్ష్మణదత్తు.... "సొమ్మున్న ప్రతి వారికీ సౌఖ్యం లభించదు. ఇతరుల కనీస అవసరాలను తీర్చినవారికి మాత్రమే ఆ అదృష్టం దక్కుతుంది" అంటారు. ఈ దృష్టిలో శ్రీ దత్తు తాము నిర్వహించే పరిశ్రమలు, ట్రస్టుల నుండి విరాళాల నిచ్చి, వానికి స్థానికుల సహకారాన్ని శ్రమ, ధన దాన రూపములలో జతచేసి సమగ్ర గ్రామీణాభివృద్ధికై నిర్విరామ కృషి చేస్తున్నారు. ఉయ్యూరులో 30 పడకల ఆసుపత్రికి సకల సౌకర్యాలతో నిర్మించి, దానిని వైద్య విశ్వ విద్యాలయానికి అప్పగించారు. రోటరీ సహకారంతో ఉయ్యూరులోనే పోలియో బాధితులకు పునరావాస కేంద్రాన్ని నిర్మింపజేశారు. హృద్రోగ సహాయనిధి ఏర్పరిచి పదిన్నర లక్షల రూపాయలను 53 మంది హృద్రోగులకు ఆర్థిక సాయంగా అందించారు.

—వ్యాస భాగం
'తెలుగు విద్యార్థి'

## ప్రేక్షకుడు

మనం మరచిపోతున్నది ఒకటుంది. సినిమా ఏకచ్ఛత్రాధిపత్యం కొనసాగింది. ఇన్నాళ్లుగానగటు సినిమా ప్రేక్షకుడు దుర్భర పరిస్థితులలో, దారుణమైన ప్రదర్శనలతో సరిపెట్టుకొని సినిమాను పోషించాడు. అతనికి ఇవ్వవలసిన ప్రాధాన్యతను మనం ఏనాడూ ఇవ్వలేదు. ఇపుడు టి.వి., వీడియోలు వచ్చిన తరువాత, వాటిని చూసిన తర్వాత సినిమాను చూడలేకపోతున్నాడు. తను కోరుకొన్న ఆనందం, తృప్తి సినిమా అందించేవరకూ అతడు సినిమాను తిరస్కరిస్తూనే ఉంటాడు. ధనికుల భవంతులలో, డ్రాయింగ్ రూములలో, పేదవాని గుడిసెలలో టి.వి.కే అంటుకొని అతుక్కొని పోయిన ఈ ప్రేక్షకుణ్ణి మనం బయటకు తీసుకువచ్చి థియేటర్ దగ్గరకు, థియేటర్‌లోనికి వెళ్లటానికి అతనికి ఏదో ఆకర్షణ కల్పించాలి. సినిమా చూడటం అతనికి అందమైన, ఆనందమైన అనుభవంగా మిగిలేలా చూడాలి. ఈ దిశలో నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు, ఎగ్జిబిటర్లు సమిష్టిగా కృషి చేయాలి.

—ఎ రమేష్ ప్రసాద్
'మూవీ మార్కెట్'లో

# పాతికేళ్ళ నాటి పిక్చర్

3

## సత్యజిత్ రాయ్
## 'ది గాడెన్'

సత్యజిత్ రాయ్ 'ది గాడెన్'ని, బ్రిటిష్ ఫిలిమ్ విమర్శకులు ఏక కంఠంతో 'సెహబాస్' అని మెచ్చుకున్నారు.... "రాయ్ ఫిలిమ్‌లన్నీ గొప్పవి. 'ది గాడెన్' కూడా అంతే. సత్యజిత్ రాయ్ భారతీయుడు - కాని, ఆయన చిత్రాలన్నీ మొదట యూరప్‌లో ప్రదర్శితమవుతాయ్. బహుమతులందుకుంటాయ్. సమకాలీనులకు వింతగా విడ్డూరంగా కనిపించే విషయాలుంటాయి. కాని, అది ఆయన ప్రత్యేకత. రాయ్ చిత్రాలలోని గొప్పతనమేమిటంటే, - ప్రాచీన వరవడిలో అంటారు, - ఆత్మోన్నతి - ఆత్మ ఔన్నత్యం అది ఈయన చిత్రాల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది" - ఫిలిమ్ క్రిటిక్ గిబ్స్ ఈ చిత్రంలోని యితివృత్తమంతా వివరించి, సౌమిత్రా చటర్జి, షర్మిలా టాగూర్‌ల నటన అపూర్వమని పేర్కొన్నాడు.... 'ది గాడెన్' ఒక సాహితీ చిత్రం. బెంగాలీ సంప్రదాయాలని చూపే పిక్చరే అయినా, మత విశ్వాసానికి సంబంధించిన కదే అయినా, పాశ్చాత్య హృదయానికి సైతం హత్తుకొనేటట్టు చెప్పడం రాయ్‌లోని ప్రతిభా విశేషం. మళ్లీ ఒకసారి తన విశిష్టతను వ్యక్తం చేశారాయన" - అని మెచ్చుకుంది 'ది గార్డియన్'.... రాయ్ ఫిలిమ్స్ లండన్‌లో ప్రదర్శించే ఏర్పాటు చేసినందుకు అకాడమీని అభినందిస్తూ, డేవిడ్ రాబ్సన్, పైనాన్షియల్ టైమ్సులో, "వివిధ మనస్తత్వాలను చక్కగా అర్థం చేసుకు, వారి మనోభావాలను అంతరంగాలను అవగాహన చేసుకు, తన ఫిలిమ్‌లు తయారు చేస్తారు రాయ్. అంచేతనే జాతీయ సంస్కృతి ద్వారా, విశ్వమానవత వ్యక్తం అవుతుంది' అన్నారు... "ఆధునిక కాలంలో వెనకటి విశ్వాసాలలోని బలీయతని, ప్రభావాన్ని విస్మరించని పిక్చర్ 'ది గాడెన్'" - అన్నారు ఫెలిక్స్ నార్కర్, 'ఈవినింగ్ న్యూస్'లో.... "మానవ హృదయాన్ని సానుభూతితో అర్థం చేసుకోవాలి; దయా గుణాన్ని మించిన విద్యలేదు. సహన సౌశీల్యాలకు పట్టంగడుతూ యదార్ధ స్వరూపాన్ని తెరమీద కళాత్మకంగా చూపుతుంది 'ది గాడెన్'" - అని 'ఈవినింగ్ స్టాండర్డ్' ప్రశంసించింది.

—చిత్ర పరిచయం
'జగతి' - డిసెంబరు 1966

# మానవ ప్రగతి

## పులిట్జర్‌లు

అమెరికాలో అతి ప్రతిష్టాత్మకమైన రెండు సాహిత్య బహుమతులు - 1991 వ సంవత్సరపు ఫిక్షన్ (కాల్పనిక రచన), డ్రామా (నాటకం) పులిట్జర్ బహుమతులు ప్రముఖ రచయితలు జాన్ అప్‌డైక్, నీల్ సైమన్‌లకు లభించాయి. అప్‌డైక్ రచన, 'రాబిట్ ఎట్ రెస్ట్' కాల్పనిక రచనకు గాను, ఆయనకు రెండవసారి 'పులిట్జర్' బహుమతిని తెచ్చింది. 'రాబిట్ ఈజ్ రిచ్' అనే రచనకుగాను అప్‌డైక్ 1982 వ సంవత్సరపు 'పులిట్జర్' బహుమతిని అందుకున్నారు. కాగా 'లాస్ట్ ఇన్ యాంకర్స్' అనే నాటకానికి గాను ప్రముఖ నాటకకర్త సైమన్ ఈ ఏడాది 'పులిట్జర్' డ్రామా బహుమతిని పొందారు. అప్‌డైక్ రచన 'రాబిట్ ఎట్ రెస్ట్' ఒక మాజీ బాస్కెట్‌బాల్ క్రీడాకారుని జీవితం గురించి చెబితే, సైమన్ నాటకం ఇద్దరు 'టీనేజర్ల' అనుబంధాన్ని చూపుతుంది. న్యూయార్కు నగరంలోని కొలంబియా యూనివర్సిటీ వద్ద పులిట్జర్ సంఘం 1991 వ సంవత్సరానికి గాను మొత్తం 26 మంది వ్యక్తులకు రెండు వార్తాపత్రికల సిబ్బందికి మొత్తం 21 బహుమతులను ప్రకటించింది. ఈ శతాబ్దం ప్రారంభంలో 'జర్నలిజం మేగ్నెట్' గా పేరు పొందిన జోసఫ్ పులిట్జర్ నెలకొల్పిన ఈ అవార్డులను కొలంబియా యూనివర్సిటీ నిర్వహిస్తున్నది. ఇలా వుండగా ఈ ఏడాది పులిట్జర్ బహుమతులను పొందిన 26 మందిలో 11 మంది మహిళలు కావడం ఒక విశేషం. ఈ ఏడాదికి ప్రకటించిన పులిట్జర్ బహుమతులను 'ఇంటర్నేషనల్ రిపోర్టింగ్' బహుమతి 'ది వాషింగ్టన్ పోస్ట్'కి చెందిన కరీల్ మర్ఫీ, 'ది న్యూయార్క్ టైమ్స్'కి చెందిన సెర్జ్ ష్మెమాన్‌లకు లభించింది. ఆక్రమిత కువైట్ నుంచి పంపిన వార్తా కథనాలకు గాను మహిళా జర్నలిస్టు మర్ఫీకి, జర్మన్ పునరేకీకరణ పైన పంపిన వార్తలకు గాను ష్మెమాన్‌కి సంయుక్తంగా ఈ బహుమతి నిచ్చారు. అంతర్జాతీయ వ్యవహారాల రిపోర్టింగ్‌లో దీర్ఘకాలపు అనుభవం

గల మర్ఫీకి 'ఇస్లామిక్ స్టడీస్' లో మాస్టర్స్ డిగ్రీ వుంది. గత ఏడాది ఆగస్టులో ఇరాకీలు కువైట్‌ని ఆక్రమించినప్పుడు ఆమె కువైట్‌లో చిక్కుబడి పోయింది. యుద్ధ భీభత్సంలో చిక్కిన ఆ దేశంలో 26 రోజుల పాటు స్నేహితుల ఇళ్లలో తల దాచుకుంటూ.... అదే సమయంలో తన రిపోర్టులను కొందరు వ్యక్తుల ద్వారా ఆమె దేశం వెలుపలికి పంపించ గలిగింది. తనకు ఆశ్రయమిస్తున్నందుకు తన మిత్రులను ఇరాకీ దళాలు చంపివేసే అవకాశమున్నందున ఆమె ఆ తర్వాత మారువేషం ధరించి కువైట్ నుంచి సౌదీ అరేబియాకు తప్పించుకు పోయింది. 'వాషింగన్ పోస్ట్'కి చెందిన జర్నలిస్టు జిమ్ హాగ్‌లాండ్ సమగ్ర రాజకీయ వార్తా కథనాలకు గాను 'పులిట్జర్' బహుమతిని పొందారు. అసోసియేట్ ఎడిటర్‌గాను, చీఫ్ ఫారిన్ కరస్పాండెంట్ గాను వున్న హాగ్‌లాండ్ 'గల్ఫ్' యుద్ధానికి దారితీసిన సంఘటనల పైన, సోవియట్ నాయకుడు గోర్బచేవ్ ఎదుర్కొంటున్న రాజకీయ సమస్యలపైన వ్రాసిన వ్యాసాలకు గాను 'పులిట్జర్' బహుమతిని అందుకున్నారు. 20 ఏళ్ల క్రితం దక్షిణ ఆఫ్రికా నుంచి చేసిన 'రిపోర్టింగ్' గాను ఆయనకు ఇదివరలో ఒక పర్యాయం 'పులిట్జర్' బహుమతి లభించింది. హాగ్‌లాండ్ 1990 లోనే తన వ్యాసాల ద్వారా.... సద్దాం హుస్సేన్ ప్రపంచ శాంతికి ముప్పుగా పరిగణించ బోతున్నాడని పేర్కొన్నాడు. ఈ ఏడాది పులిట్జర్ బహుమతులు పొందిన ఇతర ప్రముఖులలో చరిత్రకారులు స్టీవెన్ నైఫె, గ్రెగరీ వైట్ స్మిత్; శాస్త్రవేత్తలు బెర్ట్ హాల్డో బ్లెర్, ఎడ్వర్డ్ విల్సన్; హిస్టరీ టీచర్ లారెల్ థాచెర్ ఉల్రిచ్ వున్నారు. 'ది న్యూయార్కు టైమ్స్' సైన్స్ రిపోర్టర్ నటాలీ ఏంజియెర్; 'ఇండియానా పోలీస్ స్టార్' రిపోర్టర్లు జోసెఫ్ టి. హాలినన్, సూసన్, ఎం. హెడెన్; 'సెయింట్ పీటర్స్ బర్గ్ టైమ్స్'కి చెందిన షెరిల్ జేమ్స్ 'సిన్సినాటీ ఎంక్వయిరర్'కి చెందిన జిమ్‌బోర్గ్ మన్ (ఎడిటోరియల్ కార్టూనింగ్)లు; ఇంకా సంపాదకీయ రచనకు గాను 'బర్మింగ్‌హామ్ న్యూస్' పత్రిక; 'ఫీచర్ ఫొటోగ్రఫీ'కి గాను 'డల్లాస్ మార్నింగ్ న్యూస్'కి చెందిన విలియం స్నైడెర్ 'పులిట్జర్' బహుమతులు పొందారు. 'స్పాట్‌న్యూస్ ఫొటోగ్రఫీ' బహుమతి 'అసోసియేటెడ్ ప్రెస్'కి చెందిన గ్రెగ్ మారినోవిచ్‌కి లభించగా ఈ ఏడాది సంగీత బహుమతిని షులామిత్ రాన్, కవిత్వ బహుమతిని మోనా వాన్‌డుయి అందుకున్నారు. (అమెరికా సమాచార శాఖ.

## టూరిస్టులు

జాతీయ అంతర్జాతీయ పర్యాటక అభివృద్ధికి ఇతోధిక చర్యాలు తీసుకోవటం జరుగుతుందని పర్యాటక శాఖ వార్షిక నివేదికలో వెల్లడించారు.

పర్యాటక కేంద్రాల సమాచారము, కేంద్రాలలో హోటళ్లు, రవాణా సౌకర్యాలు విస్తరించబడతాయి. అడవి జంతువుల పెంపకము వాటిపట్ల శ్రద్ధ చూపడం, సేవలు మెరుగు పరచడం వ్యాసాలు, యితర సాధనాల ద్వారా భారతీయ సంస్కృతిని విదేశాలలో వ్యాప్తి చేయుటవలన పర్యాటన అభివృద్ధి జరుగుతుందని నివేదికలో తెలిపారు. 1990 సం॥లో దేశ విదేశాలలో సంభవించిన మార్పులవల్ల మన దేశానికి వచ్చే పర్యాటకుల సంఖ్య తగ్గింది. పాకిస్తాన్, బంగ్లాదేశీయులు మినహా 1989 సం. సందర్శకులతో పోల్చుకుంటే ఈ సం 0-5 శాతం తగ్గింది. 1990 సం॥లో ఇండియాకు వచ్చిన విదేశీయులు 13-30 లక్షల మంది కాని 1989 లో 13-34 లక్షలు. పాకిస్తాన్, బంగ్లాదేశీయులను లెక్కించలేదు. ఇండియాను సందర్శించే పర్యాటకులను పెంచాలనే ఉద్దేశముతో 1991ని ఇండియా పర్యాటక సంవత్సరముగా పేరుపెట్టి 'ఇండియాను సందర్శించండి' అని పర్యాటక శాఖ ప్రకటించింది. భవిష్యత్తులో పర్యాటక అభివృద్ధి ఈ నినాదంలో అభివృద్ధి చెందగలదు..... (పి ఐ బి

## ఉక్కు

ప్రభుత్వ రంగంలోని ఉక్కు తయారీ సంస్థలన్నింటినీ అనుసంధానం చేసేందుకు 1973లో భారత ఉక్కు మండలి - స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా (సెయిల్)ను ఏర్పాటు చేశారు. రూర్కెలా, భిలాయ్, దుర్గాపూర్‌లలోని ఉక్కు కర్మాగారాలు, దుర్గాపూర్‌లో ఉక్కు మిశ్రమ కర్మాగారంతోపాటు, యితర సంబంధిత సంస్థల కూడా దీనికి అనుబంధ సంస్థలుగా చెయ్యటం జరిగింది. ఐదేళ్ల తరువాత సెయిల్‌ను పునర్ వ్యవస్థీకరించినప్పుడు, ఉక్కు ఉత్పత్తి చేసే సంస్థలు మాత్రం సెయిల్ అధీనంలో మిగిలాయి. ప్రైవేటు రంగంలోని బర్న్‌పూర్ ఐ. ఐ. ఎస్. సి. ఒ. తీవ్ర ఆర్థిక సంక్షోభంలో పడటంతో, 1987లో సెయిల్ అధీనంలోకి తీసుకు రావటం జరిగింది. మహారాష్ట్ర లోని ఇనుప మిశ్రమాల సంస్థ 1985లోను, రాష్ట్ర ప్రభుత్వ యాజమాన్యంలోని విశ్వేశ్వరయ్య ఇనుము - ఉక్కు సంస్థ 1989లోనూ సెయిల్ అధర్యంలోకి వచ్చాయి. ఉత్పత్తి ఖర్చు తగ్గించటం, అధునాతన సాంకేతిక విధానాలను ప్రవేశపెట్టటం, ఉత్పాదకతను పెంచటం వంటి వివిధ చర్యలను చేపట్టటం ద్వారా పని తీరును క్రమబద్ధం చెయ్యటంలో సెయిల్ ప్రస్తుతం నిమగ్నమైఉంది.... (బలదేవ్ సహాయ్



జీవితం ఒక పుష్పం - ప్రేమ అందులోని మకరందం.

—విక్టర్ హ్యుగా





“Dad, I am told that our ancient kavya Ramayana has three different names. Is that true ?”

“Absolutely true. It all depends on the angle you take while watching the sequence of events. It tells the *AAYANAM* [movements] of Rama and hence the title *Ramayana*. *Sita Charita* is the piognant tale of a noble lady who stands out as an ideal for Indian womanhood. The third is *Poulastya Vadha* - Poulastya, you know, is another name for Ravana - as he happened to be the descendant of Poulastya - one of the Brahmas [Creators],” said Raghu’s Father.

“You mean to suggest that Rama is the hero, Sita the heroine and Ravana the villain of the piece ?”

“Oh, my boy, not that sort of angle. With implicit obedience, Rama respected his father’s wish, went into the forest and punished those who meant harm to him and to his fair name - that is *RAMAYANA*. The second one is *SITACHARITA*. With Poulastya making amorous advances, Vedavati enters *YOGAGNI* to be reborn as Sita and fulfil her vow.... Ravana, with his several boons and earthly possessions, with brute force having sway over him, fell a prey to the pristine charm of Vedavati and subsequently to a similar one in Sita, not realising tha the desire of flesh has its price to pay. In short *POULASTYA VADHA* is the supremacy of Spirit over Matter.”

---

*Swadharma Swaarajya Sangha* (*Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600103.*



# నా రాట్నచక్రం

## తల్లాప్రగడ ప్రకాశరాయడు

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్యక్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగమైన 'వ్యక్తి సత్యాగ్రహానికి' ప్రప్రథములుగా ఆయన వినోబా భావెని ఎన్నుకున్నారు ; జవహర్‌లాల్ నెహ్రూ రెండవవారు. 'జాతి పిత'గా దేశం గాంధీజీని గౌరవించి, సర్వోదయ సిద్ధాంతానికి కాస్త ఊపిరి నిచ్చిందే గాని, గాంధేయ పథం విస్మృతి పథాన పడింది.... రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో తల్లాప్రగడ ప్రకాశరాయడు గారొకరు.... కేసరిగారి 'చిన్ననాటి ముచ్చట్లు' చదివి మెచ్చుకున్న పాఠకులు, అటువంటిదే మరొకటి వేయమని కోరగా, ప్రకాశరాయడిగారి జీవితం సంక్షిప్త పరిచయం చేదామని అనిపించి, బుద్ధప్రసాద్ గారికి, రాజారామ్ గారికి అనుమతికోసం వ్రాశాము. ఇరువురూ వెంటనే అంగీకరించినందుకు మా మనఃపూర్వక కృతజ్ఞతలు.

### 11
### రాజమండ్రి కాలేజి

ఆ మరుసటి యేడు రాజమండ్రి కాలేజిలో B. A. క్లాసు సీటు దొరికింది. అప్పటికి కాకినాడది second grade కాలేజీ మాత్రమే. రాజమండ్రి కాలేజి చదువును గూర్చి గాని, అనుభవాలుగాని చెప్పుకోవలసిన పెద్ద విశేషమేమీ లేదు. రాజమండ్రి ఉనికిపట్టును ఏండ్లతరబడి బాగా ఎగిరియుండిన దొక్కటే విశేషం.

ఆంగ్లేయుడు, O.J. Couldry కాలేజి ప్రిన్సిపల్. అతడే అక్కడి చివరి అంగ్ల ప్రిన్సిపల్ అని జ్ఞాపకం. సజ్జనుడు, కళాప్రియుడు, శాంత స్వభావుడు. కొందరు కళాశాలాధ్యక్షుల కుండిన ఉద్యోగాధిక్యత, శ్వేతజాతి గర్వం, ఆపటాటోపం ఏ కోశానా అతనిలో కనబడవు. ఒక సన్నని అట్ట గొట్టంలో నాలుగు సీమసున్నపు కణికెలు వేసుకొని క్లాసుకు వచ్చేవాడు. నల్లని మీసాలు, చిరునవ్వు ముఖం! మిల్టన్, షేక్స్పియర్ చెప్పేవాడు. మిగత లెక్చరర్లతో అతనికి అనవసరం సంబంధమూ లేదు; వారందరి పట్లను మర్యాదకు లోపమూ లేదు. ఎవరి పని వారు విధాయకంగా నెరవేర్చు కుంటూ ప్రిన్సిపల్ పట్ల విధేయతతో మసలేవారు. కాలేజి అధ్యాపకుల్లో శ్రీ రామచంద్రరావు, గణితశాస్త్ర నిపుణుడు, కాకరపర్రు నివాసి; సంస్కృత పండితులు శ్రీ వ్యాసమూర్తి శాస్త్రిగారు ఉండేవారు. 'Grey hairs must be respected' అనే ఆర్యోక్తి ననుసరించి వారిని కాలేజిలో చూస్తుం డటమే నాకొక పుణ్యతీర్థ సేవనంలా గుండేది! వారిద్దరు కేవలం పుణ్య మూర్తులుగా నామనసులో మిగిలి యున్న పాతకాలపు స్మృతి. ప్రిన్సిపల్ కూల్డ్రే కళా ప్రియుడన్నాను. విద్యార్థులు దామర్ల వెంకట్రావు, వక్కలంక చినకామరాజు, జయంతి గంగన్న మున్నగువారిని తయారు చేసి, వారిచేత ఇంగ్లీషు నాటకాలు ప్రదర్శింపజేయడంలో ఈ ప్రిన్సిపల్‌కు ఎక్కువ అభిరుచి. ప్రదర్శనాలలో తనది కూడ ఒక ముఖ్యపాత్రయై యుండవచ్చు. ఆ కాలపు విద్యార్థుల, అధ్యాపకుల శకం తరువాతి కాలంలో పూర్తిగ మారిపోయింది.... చిత్ర లేఖనం, శిల్పం మున్నగు లలితకళ లంటే చెవి కోసుకొనేవాడు. కూల్డ్రే పెద్దయెత్తన స్వారిగుఱ్ఱం మీద వాహ్యాళికి వెళ్లేవాడు. ఈ దృశ్యం యిప్పటికీ నా మనసులో మెదలుతూనే వుంది. ఒకనాడు నేను రాజమండ్రి కూరలమార్కెట్టులో నుంటిని. అది వినాయకచవితి రోజు, మార్కెట్టంతా కిటకిట లాడుతోంది. మామిడాకులు, లేత వెలగకాయలు, కలువ తామర పువ్వు గుట్టలు, మారెడుకాయలు, రకరకాల ఆకుల పత్రి— మార్కెట్టు మీదంతా క్రిక్కిరిసి యుంది. కళారాధకుడు మా ప్రిన్సిపల్, ఆ దృశ్యాన్ని చూచి ఆనందించడానికి బజారుకు వచ్చియుంటాడు. కాకుంటే అతనికి బజారుపని ఏముంటుంది! అంత జనసమ్మర్దంలో కళ్లెం చేత బట్టి గుఱ్ఱాన్ని ఒక్కొక్క అడుగే నడుపు కుంటూ, చవితినాటి విలాసమంతా చూస్తూ, 'టవ్‌కో టవ్‌కో' మంటు న్నాడు. 'టవ్‌కో' అంటే తప్పుకోమన్న మాట. ఆ నిరాడంబర నిష్కపట మానవుణ్ణి ఆ స్థితిలో చూడటం నా కానందం గొల్పి, ఓహోహో అని పించింది. రెండు మూడు రకాల వినాయక విగ్రహాలను కొని పట్టు కొని పోయేయుంటాడు.

మేమక్కడ చదువుకున్న సబ్జెక్టు తత్వశాస్త్రం - Logic, Ethics, Psychology మాత్రమేగాక, యింకా యేవోకొన్ని ప్రత్యేక గ్రంథాలుకూడా ఉండేవి. వెంకటచలం B.A.కు మద్రాసు క్రిస్టియన్ కాలేజిలోచేరి, అక్కడి తన తత్వశాస్త్ర ప్రొఫెసర్, పిటింగ్రిడ్గ్‌ను గూర్చి ఉత్తరాల్లో నాకు వ్రాస్తుండేవాడు. ఎప్పుడు ఎవరు ఏ మాట చెప్పినా కాదనిచెప్పి Contradict చేసేవాడుకాడట ఆయన. ఎప్పుడైనావచ్చి, ఇప్పుడే నేనొక తెల్లకాకిని చూచివచ్చానంటే, 'Is it really so, my young man, you may be right, though I have not yet seen one' అనేవాడట; అంతే. ఎడ్డెమంటే తెడ్డె మనే శుష్కవాదాన్ని అణచివేసే సౌమ్యపద్ధతి పిటింగ్రిడ్గ్‌ది అని మా 'చలం' నాకొకసారి ఉత్తరం వ్రాశాడు. అవునంతే, శుష్కవాదం వల్ల మనిషికి టైంవేస్టు, ఊపిరివేస్టు అని చలంతో - నేనంటిని. నా అనుభవం వల్ల నాకు తెలియవచ్చిన విషయమిది.... మా రాజమండ్రి కాలేజి తత్వశాస్త్ర ప్రొఫెసర్ శ్రీ A.C. చక్రవర్తిగారు నా అనుభవంలో ఒక విశిష్ట వ్యక్తి. ఆయన తత్వశాస్త్రబోధ ఎట్లాగో ముక్కుచివరబెట్టుకొని వీది పారవేసేది కాదు. పలికే ప్రతిమాట అనుభవజ్ఞానంతో కూడినదిగా కనిపించేది. ఆయన మాటలన్నీ ముద్రలుగా నా నోటుపుస్తకంలో పడియుండేవని సగర్వంగా నేను చెప్పుకోగలను. ఆయనకు సహాయ లెక్చరరుగా శ్రీ M. లక్ష్మీనారాయణరావు గారుండేవారు. ఇద్దరి కిదరూ తగిన

అధ్యాపకులుగా లభించడం నా అదృష్టం. 'The Man Sorrows' అనే నామాంతరంగల క్రీస్తు జీవన వేదమంతా, ముద్దకట్టి యేకాంత ప్రార్థనలో ఉన్నదని నాకు తోస్తుంది .... (1947లో ఆంధ్రకేసరి ప్రకాశం నన్ను అనంతపురం జిల్లా Textile Commissioner గా నియమించి, ఒక యేడాదిపాటు నన్నక్కడికి పొమ్మన్నారు. బ్రిటిషు సర్కారు ఇండియాను విడిచి వెళ్లిపోతున్న సమయమది. ఆ కమిషనరు పని, చేతి నిండ లంచాలు మేసే ఉద్యోగం. ఏనాడూ సర్కారు ఉద్యోగ ముఖ మెరుగనీ నావంటి పల్లెటూరి గబ్బిలాయిలను, అమాంతంగా గెజెటెడ్ ఆఫీసర్లుగా చేసి, ఒక్కొక్కణ్ణి ఒక్కొక్క జిల్లాకు పొమ్మన్నారు. నేనడుగకుండ, దరఖాస్తు చేయకుండ, నేనెరుగకుండ, దిన పత్రికల్లో ఒక మిత్రుడు చూచి, నాకు చెప్పాడు. అనంతపురం వెళ్లి నా క్రింది ఆఫీసర్లనడిగి ఉద్యోగ duties తెలుసుకున్నాను. ఆంధ్రకేసరి నమ్మకంతో నాకప్పగించిన విధ్యుక్తాన్ని గౌరవనీయంగా జిల్లా కలెక్టర్ Mr. Gallette నా మీద చూపిన ఆదరాభిమానాల వల్లను, 365 రోజులు పనిచేసి ఆత్మసుఖాన్ననుభవించి బయట పడ్డాను. నా కుటుంబం, నేను అనంతపురంలో గడిపిన పొదుపు జీవనంవల్ల జీతంలో రెండువేల రూపాయలు మిగుల్చుకొని యింటికి చేరాను. సమిశ్రిగూడెం (నిడదవోలు) లో మేము కాపురముండిన గడ్డి యింటిని, ఆ డబ్బుతో పెంకుటింటిని చేశాను. క్లుప్తంగా యిదీ నా అనంతపుర ఉద్యోగ వృత్తాంతం. కలెక్టర్ Gallette 15th August 1947 న రాజీనామా చేసి ఇంగ్లండుకు వెళ్లిపోయినాడు. ఆత్మ గౌరవమంటే అది! ఆంధ్రకేసరి పంపున పనిచేసిన పుణ్యాన నా జ్ఞాపకాల గాథలలో మధ్యగా వచ్చిన ఘట్టమిది).... శ్రీ A.C. చక్రవర్తిగారితో పాటు రాజమండ్రి కాలేజిలో M. లక్ష్మీనారాయణరావుగారు తత్వశాస్త్ర అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా లభించడం నా అదృష్టం. లక్ష్మీనారాయణ రావుగారు మాకు ఒక రోజున పాఠం చెపుతూ, ఒక ఆరోగ్య సూత్రం అందించారు. పాలకంటె చక్కగా చిలికిన తియ్యని లేక చప్పని మజ్జిగ ఎక్కువ ఆరోగ్యకరమన్నారు. వారు చేసిన తత్వబోధలోని ఆరోగ్యపాఠం. అదంతా యెప్పుడో.... రాజమండ్రి కాలేజీ చదువు 1914 లో. రాజమండ్రిది పెద్ద కాలేజీయైనా, బి.యే. వాళ్లకు గూడ డ్రిల్లు క్లాసుండేది. కాకినాడ ఇంటర్మీడియేట్‌లో డ్రిల్లు లేదు. "Culture and Anarchy" Non-detailed text గా నుండేది మాకు- Matthew Arnold. ఆయన తండ్రి Thomas Arnold. ఇంగ్లాండులోని Rugby School Head Master. మాత్యు ఆర్నోల్డ్ వల్ల నాకున్న కాస్త తెలివి జ్ఞానరూపం దాల్చింది. ఏ మనిషైతేనేమి, ఏ దేశీయుడైతేనేమి జ్ఞానులు, జ్ఞానదాతలు, ప్రాణదాతలు.

"Culture and Anarchy" నా కన్ను తెరిచింది.

"జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం" - జ్ఞానాగ్ని జ్వాలస్పర్శతో పరిసమాప్తి నొందే కర్మయే యజ్ఞకర్మ అనబడుతుంది. వేదాధ్యయనులు ఉపయోగించే అగ్ని, సమిధలు ఒకసంకేతం కావచ్చు గాని, అసలు మాట లక్ష్యార్థం త్యాగం. గెటే మహాశయుని జీవనవేద మేమిటి? "Life begins with Renunciation" అని. పశ్చాత్తాపమే నిజమైన పాప ప్రాయశ్చిత్తమనే మాట సర్వ సామాన్యసత్యం. తన బిడ్డలు చేసే పాపాలకు భగవంతుడే బాధ నొందుతాడనేది, దానిని మించిన కరుణామయసత్యం. కుమారుని దుష్టబుద్ధికి, దుష్టచర్యలకు కుమిలి కుమిలి యేడుస్తున్న తల్లినిచూచి, "అమ్మా, నీ కన్నీరే నీ బిడ్డను బుద్ధిమంతుణ్ణి చేస్తుంద"ని దారినిపోయేదయాశీలి ఓదార్పు నిచ్చాడట! ఆ బిడ్డయే తరువాత మహాపురుషుడైన సెయింట్ అగస్టయినట! తల్లి కన్నీరే బిడ్డపాపాలను దగ్ధం చేసిన అగ్నిహోత్రమిక్కడ.

హృదయాన్ని ద్రవింపజేసే దైవ ప్రార్థన మహాశక్తిమంతం అని మహాత్మాగాంధి అనుభవ పూర్వక సాక్ష్యం. The mind in its own place can make a heaven of hell and a hell of heaven also ! మనో నేత్రానికున్న శక్తి చర్మచక్షువుకు లేదు. జ్ఞాన, భక్తి, కర్మ, వైరాగ్య సాధనలను సఫలం చేసేది అంతఃశక్తే కాని మరొకటి కాదు.

నా రాజమండ్రి చదువు సమయంలో నా కంటబడ్డ ఒక విపత్కర దృశ్యం ఎప్పటికినీ మరపు రాదు. మాతృత్వాన్ని మేల్కొల్పే దృశ్యమది. కొత్త గోదావరి వరద కాలం. గోదావరిగట్టు క్రిందనే మా కాలేజి. ప్రక్కవీధిలోనే ఒక పెంకు టింటి కొట్ల వరుస. నదీప్రవాహంతో దుంగలు, కలప నీటినురుగుతో కొట్టుకొని వస్తున్నాయి. పైగా రాత్రి వేళ! ఎట్లా యీదుకొని వచ్చిందో, ఒక పెద్ద నాగుపాము వచ్చి గట్టునబడ్డది. గట్టు వదలి వీధిని బడి, ఆ కాపురపు కొట్టలో ఒక శాస్త్రిగారి పెంకుటి కప్పులోనికి చేరింది. అర్ధరాత్రివేళ భార్యాభర్తలు నిద్రిస్తున్న ఎత్తయిన మంచంపైన పడ్డది, భార్య తుళ్లిపడి లేచి పెద్దకేక పెట్టి భర్తను లేపింది. భర్త లేచేలోగా పాము నేలపైబడి గది గోడనంటి యిద్దరు ముగ్గురు పిల్లలు నిద్రిస్తుండిన మూలకు పాకి వెడుతోంది. తల్లి తక్షణం మంచం మీద నుండి దుమికి పాము నడుము గట్టిగా అదిమి పట్టివేసింది. మరి వదల లేదు. పాము మధ్య భాగం కదా ఆమె చేతులకి దొరికింది! చేతికి చుట్ట వేసుకొని ఎన్ని కాట్లు వేసిందో - నడిరేయి - గుడ్డిదీపమొకటి ఒక మూల వెలుగుతోంది - బిడ్డలు బతికారు. వారి ఏడుపు విని, ఇరుగు పొరుగులు వచ్చి పామును చంపి వేశారు. బిడ్డల ప్రాణరక్షణకై ప్రాణ త్యాగం చేసిన ఆ మాతృమూర్తి ఆత్మ స్వర్గానికెళ్లిందో లేదో గాని మర్నాటి ఉదయం మేము కాలేజికి వస్తూ యింటి ముందు వచ్చి పడియుండిన పామును చూచి జరిగిన కథంతా విన్నాము. శ్రీ వడ్డాది సుబ్బారాయ కవి తన చాటువుల్లో కరుణారసభరితంగా ఈ వృత్తాంతాన్ని వర్ణించారు.

## 12
## రాజమండ్రి - హరిజన సేవ

బి.ఏ. ప్యాసై రాజమండ్రిలోనే నివసిస్తూ, వీరేశలింగం ఆస్తికోన్నత పాఠశాలలో కొన్నాళ్లు అధ్యాపకత్వం చేశాను. 'వెళ్లు వీరేశలింగంగారు మనల నెరిగినవారే కదా - స్కూల్లో మాస్టరుపని యియ్యండని అయన నడుగు మన్నారు - మా రాజమండ్రి గార్డియను, దగ్గరబంధువు, ఆ స్కూలు లోనే అంతకుపూర్వం నుండీ ఒక అధ్యాపకుడు శ్రీ రామాప్రగడ వెంకట రామయ్యగారు. వెంటనే వెళ్లి అడిగాను. "బి.యే. పూర్తయిందా? మంచిది. మీ కాలేజిప్రిన్సిపల్ నుండి ఒక యోగ్యతాపత్రం [testimonial]

తెస్తే బాగుంటుంది అని పంతులుగారు యోగ్యతాపత్రం దయ చేయమని ప్రిన్సిపల్ కూల్డ్రే దొర నడిగాను. "నువ్వు ఈ కాలేజీలో చదివావా ?" అన్నారు ప్రిన్సిపల్. నాకాశ్చర్య మయింది. "రెండేళ్ల పొడుగునా, గేలరీ అట్టడుగు బెంచి మీద కూర్చుంటూ ఉండిన విద్యార్థులలో నే నొ క ణ్ణి కదా !" అంటిని. పెద్దగా నవ్వుకున్నా డాయన. నాటకాలుమున్నగు కార్య క్రమాలలో తనకు దగ్గరగా నుండే కొందరు విద్యార్థులు మాత్రమే బాగా గుర్తు. నావంటి మిగతా వాళ్ళందరూ అంతగా దృష్టిలో నుండకపోవచ్చు "నీ వి క్క డ చదివినవాడవేనా ? అన్నాడు ముందుగా. తత్వశాస్త్ర ప్రొఫెసర్‌నుండి సర్టిఫికేట్ పుచ్చుకొని తనకి చూపించమన్నాడు. శ్రీచక్రవర్తి, ఆయన అసిస్టెంట్ లక్ష్మీనారాయణ రావుగార్లు తమ తత్వశాస్త్ర క్లాసులోని అగ్రగణ్య విద్యార్థులలో ప్రకాశరాయ డొకడని యోగ్యతా పత్రాలు వ్రాసి నాచేత బెట్టారు. వాటిని తీసుకువెళ్లి ప్రిన్సిపలుకు చూపించాను. అవి చూచి వెంటనే ఒక Letter Paper తీసి ఆ వి ధం గా నే తాను గూడ వ్రాసి "His Conduct is Excellent" అని చేర్చి నాకిచ్చేడాయన. అవన్నీ చూచి వీరేశలింగంగారు నాకు అధ్యాపకోద్యోగ మిచ్చారు. నా అధ్యాప కత్వాన్ని గూర్చి చెప్పవలసిన విశేష మేమీలేదు. కాసులోకి వెళ్లడం, తెలి

సిందేదో చెప్పడం, తిరిగి యింటికి వెళ్లడం - మామూలే !

అయితే ఒక విషయం వుంది. శ్రీ పొడమున్నూరు రామచంద్రరావు గారిని ఉడిపి ప్రాంతం నుండి కుటుంబ సహితంగా రాజమంద్రికి రప్పించారు వీరేశలింగంగారు. రామచంద్ర రావుగారు ఆస్తికోన్నత పాఠశాలలో (మత) ధర్మబోధకుడు గాను, ఆయన భార్య లక్ష్మీకాంతమ్మగారు వీరేశలింగంగారి 'విక్టోరియా వితంతు శరణాలయ' పర్యవేక్షకురాలుగాను నియమింపబడ్డారు. వారి ఏకైక సంతానం పద్మావతి. ఇంటర్మీడియేట్ చదువుతూ, రాజమంద్రిలోనే వివాహమైన కొద్ది రోజులకే మృతి నొందింది. కుమార్తె చావు భరించలేక తల్లి గోదావరిలోపడి చనిపోయింది. సంఘ సంస్కార ప్రియుడైన రామచంద్ర రావుగారు కొందరు మిత్రులను కలుపుకొని నిమ్నజాత్యుద్ధరణ సంఘమనే పేరుతో (Depressed Classes Mission) రాజమండ్రిలో ఒక సంఘాన్ని స్థాపించారు. నిమ్న జాతుల బాలబాలికలకు రాత్రి పాఠశాలల స్థాపన ప్రధానంగా జరిగిన పని. కోలమూరు, కొారెతమూరు, గాడాల, సింగవరం మున్నగు గ్రామాలలో మాల మాదిగ పిల్లలకోసం పాఠశాలలు ఏర్పాటయినవి. సంఘానికి నేను కార్యదర్శిగాను, వీరేశలింగోన్నత పాఠశాలాధ్యాపకులు శ్రీ కోరుకొండ లింగమూర్తిగారు అధ్యక్షుడుగాను నియమితులమైతిమి. ఒక్కొక్క పాఠశాల పర్యవేక్షణకు వారానికొకసారి రామచంద్రరావుగారి వెంట నేను గూడ వెడుతూ, రాత్రికక్కడనే వుండిపోయేవాళ్లం. ఉపాధ్యాయుల నెల జీతాల కోసం, ఆయా గ్రామల లోను, రాజమంద్రిలోను, ఇంటింటికీ తిరిగి, నేనూ, నాకు తోడు శ్రీ పాలకోడేటి సూర్య ప్రకాశరావుగారు (డాక్టరు గురుమూర్తిగారి సోదరుడు), నెల చందాలు పోగు చేసుకునేవాళ్లం. కాళ్లు నొప్పులు పుట్టేటట్టు తిరిగేవాళ్లం. రామచంద్రరావుగారు కూడ తరుచు మాతో తిరిగేవారు. వయసులో మా కంటె పెద్దవాడైనా, అయన చూపినది విసుగు విరామం లేని శ్రద్ధ. కార్యోత్సాహం, శ్రద్ధ మాకందరికీ జీవిత పాఠంగా నుండేవి. అయన ప్రోత్సాహమే మాకీ సేవామార్గాన్ని చూపి ధన్యులను చేసింది. సేవానురక్తికి పెట్టింది పేరుఆ మహనీయుడు. నిమ్న జాతులసేవ అయన మాకు నేర్పిన పాఠం. ఆరోగ్యాన్ని కాపాడుకునే చిన్న చిన్న అయుర్వేద చిట్కా ఔషధాలను సూచించి, చేసి యిచ్చేవాడు. కొన్ని సులువైన వ్యాయామాలు నేర్పడంపట్ల ఆయన కెంతో అభిమానం. ప్రపంచ దేశాల భూగోళవిషయాలు ఆయనకు కొట్టినపిండి. బహువిషాదకరమగు తల్లీకూతుళ్ల మృతి ఆయనలో మరింత మార్పుతెచ్చి, ప్రజాసేవ పరాయణుని చేసింది. చివరికాలంలో వీరభద్రపురం (రాజమంద్రి చివరి సరిహద్దు లోపలి ఒకపేట)లో ఆరు వందల చతురపు గజాల విశాల

నివేశన స్థలం వెలకు తీసుకొని, దాని లోని ఒక ఎత్తు దిబ్బ మీద నివాస మేర్పరచుకొన్నాడు, తత్పూర్వం వీరేశలింగంగారు ఉపయోగించే ఎద్దు బండి పైభాగం, అంటే పెద్దచెక్కల పెట్టెను ఆయనవద్ద తీసుకొని, దానిని ఆ యెత్తుదిబ్బ మీద అమర్చుకొని, అందులో ఒంటరిగా నివసించేవాడు రామచంద్రారావుగారు. చూచేవారికి ఆశ్చర్యమయ్యేది! స్వర్గీయకుమార్తె పద్మావతిపేర ఆ స్థలంలో ఏర్పర్చ దలచిన పుస్తకభాండాగారం పఠనాల యం మున్నగువాటి నిర్వహణకుగాను నాతో సహా ఐదుగురు ధర్మకర్తల సంఘాన్ని నియమించి, పద్మావతి అస్తికలు స్థలం మధ్యగా భూస్థాపితం చేశాడు. పుస్తకాలయం పద్మావతి పేరను, పద్మావతిని వివాహమాడిన శ్రీ నాభి రామకృష్ణారావు పేరుతో ఆశ్రమాన్ని నిర్వహించమని ట్రస్టు పత్రంవ్రాసి రిజిష్టరు చేయించాడు. ట్రస్టీలలో ఎక్కువమంది చనిపోవడం వల్లను, నేను రాజమండ్రిని విడిచి ఇతర స్థలాలలో స్థిరపడటం వల్లను, రామచంద్రరావుగారు కోరినప్రకారం ఆ స్థలాన్ని వినియోగ పరచలేక, చివ రకు దానిని శ్రీమతి దుర్గాబాయ్ దేశ్ ముఖ్ ద్వారా రాజమండ్రిలో యేర్పాటయిన 'కస్తూరిబా గాంధి ధర్మ సంస్థ' పేర దస్తావేజు వ్రాసి, ధర్మ కర్తలలో బ్రతికియుండిన నేను, శ్రీ పాలకోడేటి సూర్యప్రకాశరావుగారు ఏకస్తులమై దఖలు పరిచాము. కొద్ది యేండ్లకు పూర్వం సూర్యప్రకాశరావు గారుకూడా పరమపదించారు. రామ చంద్రరావుగారు తమ ట్రస్టుపత్రంలో వ్రాసిపెట్టిన ముఖ్యషరుతులు మేము వ్రాసి యిచ్చిన దస్తావేజులో స్పష్టం చేశాము. కస్తూరిబా ట్రస్టు సంఘం వారు ఆ స్థలంలో ఏ యే పనులు నిర్వహిస్తున్నారో వ్రాతమూలకంగా నేను వాకబు చేస్తూనే ఉన్నాను. మహానుభావుడు శ్రీ రామచంద్రరావు గారి జీవితాశయాలనుగూర్చి, ఆయన

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలు వడేవన్నీ మా అంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగు తాము. చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

యొనర్చిన నిస్స్వార్థ సేవనుగూర్చి యిక్కడ విధాయకంగా భావిస్తున్నాను. నాబోటి సామాన్య జీవితాలకు కాస్తో కూస్తో విలువను చేకూర్చినది ఆయన చేతిక్రింద లభించిన సేవాభాగ్యమే. రాజమంద్రి రైలురోడ్డు కావలితట్టున ఒక పెద్ద పాకీవారిపేట ఉండేది. తరుచు రాత్రిపూట ఆ పేటకు వెళ్ళి చేతనైనట్లు వారి యిబ్బందులను తీర్చడానికి ప్రయత్నించే వాళ్ళం. రామచంద్రరావుగారు ముదుసలియై స్వర్గాస్థానికి వెళ్ళిపోయినాడు. ఆదిలో ఆయన రాజమంద్రికి వచ్చేటప్పుడు ముగ్గురు అనాథ బిడ్డలను వెంటగొని వచ్చి, కాకినాడ అనాథ శరణాలయంలో చేర్చాడు. అందొక రేమైనారోకాని, యిరువురు వివాహితులై యిప్పటికిని బాగున్నారు - 'ఆనంద' ఒకడు, 'ఇందిరమ్మ' ఒకతె. రామచంద్రరావుగారివంటి ప్రజాబంధువులు సామాన్యులలో అసామాన్య మహా పురుషులు, ఈ ప్రపంచంలో బహు అరుదు! ఆయన వెళ్ళిపోయేముందు ఆయనతో కలిసి మేము తీయించుకొన్న Group Photo ఒకటి; అంతకు పూర్వ మెప్పుడో, ఆ తల్లికుమార్తెలు, - లక్ష్మీకాంతమ్మ, పద్మావతి, యిరువురూ కలిసి యున్న ఛాయాపటమొకటి నాకు మిగిలి యున్నవి. (ఇంకా వుంది

❀

శ్రీ తల్లాప్రగడ రాజారామ్, గాంధేయ సమాజ సేవా సంస్థ (అవనిగడ్డ-521 123) సౌజన్యంతో....పుస్తకం వెల : రు. 20-00.

# ముఖ చిత్రం

స్వాతంత్ర్యానంతర భారతంలో, షణ్ముగం చెట్టి, జాన్ మత్తయ్, చింతామణీ దేశ్ముఖ్ వంటి ఆర్థిక నిపుణులు, ఆర్థిక వ్యవహారాలు కూలంకషంగా తెలిసినవారు, ఆర్థిక మంత్రిత్వశాఖని నిర్వహిస్తూండేవారు. అన్నిటికంటె అతిక్లిష్టతరమైనది, కీలకమైనదీను. ఆర్థిక సుస్థిరత, సౌష్టవాల నుంచే దేశాభ్యుదయమూ పునర్నిర్మాణమూ సాధ్యమవుతాయి. నేల విడిచి సాము చేసిన కారణంగానే, మన ప్రగతి కుంటువడింది; ఇంటా బయటా అప్పులెక్కువయాయి; దిన దినప్రవర్ధమానంగా పెరిగే ధరలతో సామాన్యుడు వుక్కిరి బిక్కిరవుతున్నాడు. పాలించే పెద్దలు యిన్నాళ్ళకు మేల్కొని, ఆర్థికశాఖను రాజకీయ దుమారాలకు దూరంగా ఉంచగలిగారు.... జాతీయంగా అంతర్జాతీయంగా ఆర్థిక రంగంలో విశేషానుభవం గల పద్మవిభూషణ్ మన్మోహన్ సింగ్ కేంద్ర ఆర్థిక మంత్రిగావడం ఎంతో శుభసూచకం. అమాంత్రం ధరలు తగ్గించగల మంత్రదండం తన వద్దలేదని నిర్మొగమాటంగా చెప్పగల ధీరస్వాంతుడాయన. రిజర్వ్‌బాంక్ గవర్నరుగా పనిచేసిన, ఈ అనుభవజ్ఞునికి, ఆర్థిక శాఖలోని లోటుపాతులు క్షుణ్ణంగా తెలుసు. ❁

# కొత్త పుస్తకాలు

'పాతివ్రత్యం నుండి ఫెమినిజమ్ దాకా' (ఆత్మకథ) రచన : మల్లాది సుబ్బమ్మ. ప్రచురణ : మల్లాది సుబ్బమ్మ ట్రస్టు, 9 ఎమ్ఐజిహెచ్ కాలనీ, మోహిదీ పట్నం, హైదరాబాదు - 500 028. వెల : సాదాప్రతి రు. 80/-; మేలు ప్రతి రు. 150/- .... సోల్ డిస్ట్రిబ్యూటర్స్ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, హైదరాబాదు - 500 001.

"ఒక తాజ్‌మహల్ కట్టాలంటే ఒక్క శిల్పిమాత్రమే చాలడు. కట్టడాన్ని ఊహించేవారు, ప్లాను వేసే వారు, రాళ్లుమోసేవారు, కట్టుబడి చేసే వారు, రూపురేఖలకు మెరుగులు చేకూర్చేవారు, జీవకళను పొదిగే వారు, అందరూ కలిసి సామూహిక సహకారం అందిస్తేనే, శిల్పి శిలా ఖండాన్ని సమాజానికి చేకూర్చగలడు. అలాగే నా ఆత్మ కథకు ప్రేరణ కలిగించినవారు, ఉత్తేజాన్ని అందించిన వారు, ప్రోత్సాహ పరచినవారు, ఆసాంతం చేదోడుగా ఉన్నవారు ఎందరో ఉన్నారు" – అని అంటున్నారు రచయిత్రి నమస్సుమాంజలి పలుకుతూ! కనుపర్తి వరలక్ష్మమ్మ, దుర్గాబాయి దేశ్‌ముఖ్, ప్రేమలతా గుప్త, వీణా మజుందార్, నెక్సలర్ దంపతులు, దేవదేఖర్, కులియన్ మున్నగువారి ప్రోత్సాహమూ, జీవిత సహచరుని (అడ్వకేట్ రామ్మూర్తి) సహాయ సహకారాలు గురించి ప్రస్తావించి, ఆర్థిక సహాయ మందించిన తెలుగు విశ్వ విద్యాలయానికి ధన్య వాదాలర్పించారు.

సుబ్బమ్మ గారంటేనే సూటి మాటకు తేట మనసుకూ మరో పేరు, 'ఎదురీదే చేతులుంటె ఏరు దారి యివ్వక ఏం చేస్తుంది' - అని నారాయణ రెడ్డి; భారత మహిళోద్యమంలో ఉజ్వల తార మల్లాది సుబ్బమ్మ - అని తార్కుండే; శ్రోత్రియం నుండి శాస్త్రీయతకు, శుద్ధ ఛాందసం నుండి హేతుత్వంలోకి పరిణామం చెందిన స్వయం సిద్ధ జీవితగాథ – అని ఆవుల సాంబశివరావు; సుబ్బమ్మ గారి వివిధ రచనలు (ఆత్మకథతో సహా) చదివినవారికి తెలుగులో ఒడుపుగా రాయటం మాట్లాడటం అలవడుతుంది - అని భద్రిరాజు కృష్ణమూర్తి; 'కొంత మందికి నువ్వు తుఫానువు; ఇంకొంత మందికి తొలకరి వానవు' - అని రావూరి భరద్వాజ; సజీవధార ప్రవహిస్తుంటే అందులో

దానితోపాటు కొట్టుకొని పోతున్న అనుభూతి కలిగింది - అని జివి సుబ్రహ్మణ్యం ; సుబ్బమ్మగారి ఆత్మ కథ ఒక రకంగా కందుకూరి వీరేశ లింగం సంస్కరణోద్యమానంతరం వచ్చిన తెలుగు స్త్రీల జీవిత చరిత్ర - అని కేతు విశ్వనాథరెడ్డి ; సుబ్బమ్మ గారి జీవిత కథ చదువుతుంటే ఒక మసక చీకటి గదిలో పెట్టిన మొక్క, సన్నని కిటికీ సందులలో నుంచి పడే సూర్యకిరణం కోసం అర్రులు చాస్తూ ఎదిగే మొక్క జ్ఞాపకం వస్తుంది - అని సం డూ రి రామమోహనరావు – మొదటి పేజీలలో చెప్పగా, చివరి పేజీలలో పోలు సత్యనారాయణ, చేపులపల్లి రామానుజరావు, యమ్మెస్ రెడ్డి, సూర్యదేవర రాజ్యలక్ష్మమ్మ, చంద్రశేఖరరావు పిరాట్ల వెంకటే శ్వర్లు, జ్వాలాముఖి, ఝాన్సీ మున్నగు వారు పుస్తకావిష్కరణ సందర్భంగా తమ అభిప్రాయాలు వ్యక్తం చేశారు.... 50 తెలుగు గ్రంథాల పట్టిక, 36 కరపత్రాలపేర్లు, 7 ఇంగ్లీషు అనువాదాలపేర్లు, 4 మళయాళ భాషాంతరీకరణ పుస్తకాలు పేర్లు, 10 ఫీటీలు, 13 జీవిత చిత్రణ రచ నలు, 10 సన్మానాలు తేదిలతో సహా, 25 రేడియో ప్రసంగాల పేర్లు, 24 చర్చలు, 10 మహిళా సంఘాల కార్యక్రమాలు, 22 దూర దర్శనీయ చర్చలు, 16 వ్యాసాలు వివిధ పత్రిక లలో, 49 పరిశోధనా పత్రాలు సెమి నార్లలో (అన్నీ తేదీలతో), 'వనితా జ్యోతి'లో ప్రశ్నలు – సమాధానాలు, మహిళా వికాసం, 42 వివిధ పత్రిక లలో వ్యాసాలూ తేదీలతో, 70 మహాసభలు, 37 వివాహాలు వికాస కేంద్రంలో, ఉద్యమాలు - ఉపన్యా సాలు – ఈ పన్నెండవ అనుబంధం రచయిత్రి నిర్విరామ కార్యక్రమావళిని, బహుముఖ ప్రజ్ఞా పాటవాన్ని చెబు తుంది.

"మహిళోద్యమ వ్యాప్తికి సుబ్బమ్మ గారు తగిన కార్యకర్త కాగలరని నేను అచిరకాలంలోనే గ్రహించాను. ప్రజో ద్యమాలలో, యువత ఉద్యమాలలో నిరాశకులోనయిన నేను, మహిళోద్య మంపట్ల మొగ్గు చూపే తరుణంలో యీ జ్ఞానోదయం నాకు కలిగింది" – అంటారు భర్తరామ్మూర్తి (పేజీ 273)

"నిన్ను మించిన కీర్తి నా కిచ్చి - నా వెనుక నుండి స్ఫూర్తి నిచ్చి - అండ దండల నందించి – నీతిగ నిల్చింది నీవే రామయ్య" – అంటారు భార్య సుబ్బమ్మ (పేజీ 270)

రచయిత్రి తన అంతరంగ మథ నంలో అంటారు : "ఏం సాధిద్దామను కున్నాను ? ఏం జరిగింది ? నా ధ్యేయం సేవా దృక్పథమా? సాహిత్య ప్రచారమా ? సంస్థాగత కార్య క్రమమా లేక ప్రబోధాత్మమా ? .... అసలింతకూ నా ధ్యేయం, లక్ష్యం ఏమిటి ? - నేను సాధించిందేమిటి ? అనే తాత్వికచింతన అప్పుడప్పుడు నన్ను కలవరపరుస్తుంది" (పేజీ 260)

'జనసానం గుంటూరు జిల్లా

పోతార్లంక. 2-8-1924 రక్తాక్షి నామ సం॥ శ్రావణ శుద్ధ విదియ శని వారం ఉదయం గం॥ 8-36 ని॥లకు ఆశ్లేష నక్షత్రంలో పుట్టాను.... తండ్రిగారి ఇంటి పేరు 'కొండూరి' - కౌండిల్యస గోత్రం - వెలనాటి వైదిక బ్రాహ్మణులు. వైశాఖ శుద్ధ దశమి గురువారం (తేది 15-5-1935) పెళ్లిలగ్నం పెట్టారు. అమ్మాయి, అబ్బాయిల చూపులు గాని, మాటలుకాని, ఒప్పందాలుగాని ఏమీ జరగలేదు. అంతా పెద్దల సమక్షంలో వారి ఆలోచనలతో జరిగి పోయింది.... కట్న కానుకలతో అయిదు రోజుల పెళ్లి. అప్పట్లో తులం బంగారం 18 రూ॥లు ; 16 కిలోలు పట్టే నేతి డబ్బా 8 రూ॥లు.... నా సమర్త నాటికి నాకు 11 ఏళ్లు. నా భర్త రామ్మూర్తిగారికి 17 ఏళ్లు మాత్రమే. చదువు పూర్తి కాలేదు కాపురానికి తేవటమా, వద్దా అన్నది మా అత్తమామలకు చర్చనీయాంశం అయినది.... మొదటి కాన్పు 1938 అక్టోబరు నాటికి నాకు 14 సం॥లు.... 1940 మార్చి 4 వ తేదీన రెండో పిల్లాడు (కామేశ్వరరావు)

కలిగాడు.... రెండేళ్లు నిండకుండానే మొదటి పిల్లవాడికి డిఫ్తీరియా వచ్చి 24 గంటల లోపు చనిపోయాడు.... గోపాలకృష్ణమూర్తి 1943లో పుట్టాడు.... 1944 మేలో మూడవ అబ్బాయి (వెంకటేశ్వర్లు, పుట్టాడు 1949 సెప్టెంబరులో ఆడపిల్లపుట్టింది .... 1951 నుండి 1954 వరకు నా జీవితంలో మరో దశ ప్రారంభ మయింది,'.... అంటే కుటుంబానికి, గృహ కృత్యాలకు, అత్తమామలకు, భర్తగారికి పరిమితమైన దృక్పథం, బయట ప్రపంచం వైపు ఆసక్తితో చూడసాగింది. ఈ పరిణామంలో ఒక కపట స్వాముల వారి పాత్ర (పేజీ 84) లేకపోలేదు. ఏమయి తేనేం, 1954తో పాతివ్రత్య ప్రకరణ ముగిసి, ఫెమినిజమ్ ప్రారంభమవు తుంది.

'మా పిల్లలు ఒకరికి హాని, అప కారం, మోసం చెయ్యరు. స్వార్ధ పరులు కాదు. శ్రమపడి వృత్తి విద్యలు చదివారు' - అని మాతృ హృదయం యోగ్యతా పత్రం యివ్వ నక్కర్లేదు. అదేవిధంగా అత్తగారిని విమర్శించడం, మామగారి ఘనత చెప్పడం సందర్భోచితం కాదేమో ననిపిస్తుంది. అయితే ఉన్నదున్నట్లు చెప్పదలుచుకున్నాను, చెప్పాను - అనవచ్చు రచయిత్రి.

'జాగృతి – చైతన్యం' విభాగంలో తనలో మార్పు ఏ తీరున వచ్చినదీ సేవా కార్యక్రమాలలో ఎలా శిక్షణ పొందినదీ చెబుతారు. పొట్టి శ్రీరాములు దీక్షకాలం నుంచీ వేర్వేరు ఉద్యమాలలో ఈమె పాల్గొన్నారు. ఒకసారి 'వికాసం' పత్రికలో ఈమె వ్యాసాన్ని 'యమ్వీఆర్' (భర్త) అచ్చు వేయడానికి నిరాకరించడంతో, ఈమెలో రచనాభిలాష అధికమై ఆయన మెప్పు పొందేటట్లు రాయ గలుగుతారు. జర్నలిస్ట్, రేషనలిస్ట్, ఫెమినిస్ట్, హ్యూమనిస్ట్, రాడికల్ హ్యూమనిస్ట్ ఈ శబ్దజాలమంతా మనం పాశ్చాత్య సంస్కృతీ వాహిని నుంచి తెచ్చుకున్నది. కాని, మన జీవి తమూ, జీవన విధానాలూ మాత్రం ప్రాచ్యఖండపు విలువల్లో, ఆ సంప్ర దాయపు లోతుల్లో కూరుకు పోయి వున్నాయి. సిద్ధాంతాల కంటె జీవితం గొప్పది – ఉద్యమాలతో ఊపిరి పోసుకున్న సుబ్బమ్మగారి జీవితం గొప్పది.

ఎవరైనా స్వీయకథ చెబు తున్నప్పుడు వ్యక్తి జీవన దృక్పథం నుంచి జీవయాత్రా విశేషాలు క్రమాను గతంగా చెబుతూ, ఆశయాలు, అభి ప్రాయాలు, సిద్ధాంతాలతో పేచీపడటం తర్కించుకుంటూ పోతే, కథా కథనం రసవంతమై రాణిస్తుంది.

—క్షీరసాగరమ్

✠ ✠ ✠

'జమీన్ రైతు' వజ్రోత్సవ విశేష సంచిక (1930 - 1990).... జమీన్ రైతు వారపత్రిక, నెల్లూరు - 524001. వెల: రు 15-00 మేనే జింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామూర్తి.

తెలుగువారికి దిన పత్రిక చదవడం నేర్పినది కాశీనాధుని నాగేశ్వర రావు 'ఆంధ్ర పత్రిక'. కృష్ణామండలమే కాదు, మొత్తం తెలుగు వారిలో రాజకీయ చైతన్యం తెచ్చినది ముట్నూరి కృష్ణారావు 'కృష్ణాపత్రిక'. జమీందారీ రైతులకు న్యాయం చేకూర్చమని పోరాడింది నెల్లూరు వెంకట్రామానాయుడు 'జమీన్ రైతు' - ఈ ముగ్గురు మహనీయులనీ పోలిన పత్రికా సంపాదకులు లేరు – అటువంటి పత్రికలు యిక రావు. లక్షల సంఖ్యలో కాపీలు అమ్మవచ్చు; కోట్లు గడించవచ్చు. కాని, పత్రికా నిర్వహణ ఒక పవిత్ర బాధ్యతగా పరిగణించిన కాలం చరిత్ర పుటలలో కలిసిపోయింది. అధిక సంఖ్యలో ప్రతులు అమ్మడం అటు వుంచి, కనీసం సామాజిక బాధ్యత గుర్తిస్తే చాలుననుకొనే స్థితికి వచ్చాము.

ఒక సామాన్య వార పత్రికకు అరవై ఏళ్లు నిండటం, వజ్రోత్సవం చేసుకోవడం, భారత రాష్ట్రపతి వెంకట్రామన్ ఆ ఉత్సవానికి నెల్లూరు రావడం, నెల్లూరుకే కీర్తిపతాక అని చెప్పవచ్చు. గిరిజ, సీతారామశర్మ, అబ్బిరెడ్డి, రాఘవరెడ్డి, మహానంద, రంగారెడ్డి, వెంకురెడ్డి, రమణరెడ్డి, పురుషోత్తం, నరసింహశాస్త్రి, కృష్ణమూర్తి, గోపాలరావు, నారాయణ రావు, రామచంద్రరావు, శేషాద్రి, రసిక్, భరద్వాజ, సింహా, కొండమాచార్యుల వ్యాసాలు; పఠాభి, గజ్జెల మల్లారెడ్డి, సుబ్బరాయుడు, మాలకొండా రెడ్డి, బోయి భీమన్న, అనంత పద్మనాభరావు, శేషేంద్ర, రాధా కృష్ణశర్మ, శివారెడ్డి, మోనా, జయంపు కృష్ణ, సురభి నరసింహం, చిత్రకవి ఆత్రేయ కవితలు - ఈ వజ్రోత్సవ సంచికకు నిండుతనం తెస్తున్నాయి.

" 'జమీన్ రైతు' వయస్సు అరవై ఏండ్లయితే, అందులో నా జీవితం నలభై రెండు సంవత్సరాలు. ఈ సుదీర్ఘ కాలంలో 'జమీన్ రైతు'ని నేనేమి చేయగలిగాను ? దానిని కించిత్ అయినా అభివృద్ధి చేయగలిగానా ?.... స్థానికంగా వుండే వ్యక్తులతో పరిచయాలు కలిగి, నిత్యం వారి ముఖాలు చూస్తూ, వారిని గూర్చి నిర్మొగమాటంగా నిశితంగా విమర్శించవలసి రావడమనేది కత్తి మీద సామువంటిదే; ఒక విధంగా నిప్పుతో చెలగాటమే.... రాజాజీ నాయకత్వాన హేమా హేమీలతో ఏర్పడిన 'స్వతంత్ర పార్టీ' ఒకప్పుడు కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయం అనిపించింది. కాని, అనతికాలంలోనే సోదిలోకి కూడా రాకుండా పోయింది...." నేనొక రాజకీయ పరిశీలకుణ్ణే తప్ప ప్రత్యక్ష రాజకీయవాదిని కాదు...." – అంటున్నారు 'ఆత్మావలోకనం'లో నెల్లూరు శ్రీ రామమూర్తి.

బాపు ముఖచిత్రంతో విలువైన వ్యాసాలతో నెల్లూరు మండల చరిత్రకు కరదీపిక ఈ విశేష సంచిక.

—సుమతీ సాగర్



## సెప్టెంబరు 09, 1991

శర్మా దంపతులు చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు ప్రారంభించి, మొన్న ఏడో తేదీకి 54 ఏళ్లయింది. వారిద్దరూ దివంగతులైనా, వారు నాటిన మొక్క మహావృక్షమై, ఎందరికో నీడనీ ఫల పుష్పాదులనీ యిస్తూ, విద్యారంగంలో ఎనలేని పేరు ప్రఖ్యాతులు తెచ్చుకుంది. ఇవ్వాళ మ్యూజిక్ అకాడమీలో స్కూలు పిల్లల వెరైటీ ఎంటర్‌టైన్‌మెంట్. అదిత్య స్తోత్రంతో ఉదయభానుడు సప్తాశ్వుడైన భోమండలం మీదకి రావడం ప్రథమ ఘట్టం. ఆ సుమనోహర నృత్యగీతికను విద్యార్థినులు ఎంతో చక్కగా వొప్పించారు. ఆ తర్వాత ప్రెట్టీ బర్డ్స్, గుడ్ హేబిట్స్, గాడ్ ఈజ్ గ్రేట్ - ఈ మూడు నృత్య ప్రదర్శనలూ చిన్నారులు, చిట్టి పాపలు ఎంతో చక్కగా చేశారు. ఈ నాటి కార్యక్రమంలో నూటయాభై రెండువందల మంది పిల్లలు పాల్గొని వుంటారు ఇంకా ఎక్కువేనేమో కూడా. వాద్యసంగీతమూ, తమిళ నాటకమూ తర్వాత, 'భిన్నత్వంలో ఏకత్వం' నృత్యనాటిక చాలా ఘనంగా ఉంది. అయిదుగురు అర్చకులు (దేవాలయం), అయిదుగురు మౌల్వీలు (చంద్రవంకలో నక్షత్రం), అయిదుగురు ఫాదరీలు (క్రాస్), అయిదుగురు బౌద్ధభిక్షువులు - ఆయా సంప్రదాయాలలోని అతివల నృత్యాలు. మతాలు వేరైనా జాతి ఒక్కటే సుమా, అది మరువకండి - అని రసప్రపూర్ణంగా చెప్పిన నృత్యనాటిక యిది, ప్రిన్సిపాల్ శకుంతలా శర్మ స్వాగతం తెలుపగా, అధ్యక్షత వహించిన మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ అరుణాచలం, ఈ విద్యాలయానికి గల ప్రత్యేకత చెబుతూ, మణిపూసల్లాటి పిల్లల్ని తయారు చేస్తోందన్నారు.... ఉదయ సంధ్య సూర్య నమస్కారమైతే, సాయం సంధ్య ట్రయిబల్ డాన్స్. మధ్యలో ఇంగ్లీషు నాటకం, తెలుగు నాటకం, మరికొన్ని నృత్యాలు. పిల్లలకు యింత చక్కటి శిక్షణ యిచ్చి, సంగీత నృత్యాదులతో సభికులని రంజింప జేసిన టీచర్లు అభినందనీయులు.

13

కళా వాచస్పతి జగ్గయ్య సభాధ్యక్షులుగా, మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధిపతి ఆచార్య రామచంద్ర ముఖ్య అతిథిగా, సినీ రచయిత వెన్నెలకంటి ప్రధాన వక్తగా ఆచార్య ఆత్రేయ ద్వితీయవర్ధంతి, పానగల్ పార్కు దగ్గిరున్న వెంకటేశ్వర కళ్యాణ మండపంలో, 'మనస్విని' జరిపింది. ఆచార్య ఆత్రేయ రచనా సంపుటాలని వెలుగులోనికి తెచ్చినది 'మనస్విని'యే! (ఎ 4 - అన్నానగర్, మద్రాసు-40). 'మనస్విని - ఆత్రేయ' పేరిట ప్రతీ సంవత్సరం, మద్రాసు విశ్వవిదాలయంలోని యమ్. యె. స్టూడెంట్స్‌కి యివ్వనున్న ఉపకార వేతనాలు, రెండూ రెండున్నర గంటల ఉత్తమ నాటకానికి పదివేల రూపాయల బహుమతి, ఉత్తమ సినీ గేయానికి బంగారు పతకం - యిలాటివి అధ్యక్షులు జగ్గయ్య సభాముఖంగా వెల్లడి చేశారు. తాను ఆత్రేయ భక్తుడనని చెబుతూ, వెన్నెలకంటి, ఆత్రేయ సినీ సాహిత్యంలోని, కారులో షికారు, పోయినోళ్ళ తీపి గురుతులు యిలాటివి కొన్ని సోదాహరణంగా పేర్కొన్నారు .... వివరంటూ వుండాలనిపించింది. గాని ఏడున్నరకి మరొక చోటుకి వెళ్లాలి; అంచేత, మధ్యలో వచ్చేయవలసి వచ్చింది.

..... 16

"ఆడువొమె, పాడువొమె అన్నా, సుందర తెలుగు అన్నా, గంగా కావేరీలు ఏకధారగా ఈ పవిత్ర భూమిని సుసంపన్నం చేయాలన్నా, ఆయన కంఠంలోని కవితాకోకిల పలికినది జాతీయత, దేశీయత. ఈ భూమి, ఈ ప్రజలు సుఖశాంతులతో విలసిల్లాలని ఆయన వైతాళిక స్వప్నం. తమిళనాడుకే కాదు యావద్భారతానికి ఆ స్వప్నం స్ఫూర్తి నిచ్చింది. తమిళ సాహిత్య సీమలో యిది భారతి శకం. ఆయన గానంతో ప్రభావితులు కాని రచయితలు లేరు" - అన్నారు ప్రఖ్యాత సాహితీవేత్త జయకాంతన్, కేంద్ర సాహిత్య అకాడమీ వారు, శ్రీనివాస గాంధీ నిలయమ్‌లో ఏర్పరిచిన లిటరరీ ఫోరమ్‌లో. కృష్ణమూర్తి స్వాగతం తెలిపి, వందన సమర్పణ గావించారు.... సాహిత్య అకాడమీ 'లిటరరీ ఫోరమ్' లోని సుగుణం ఏమిటంటే మాట్లాడే వారు ఒక్కరే ఉంటారు; ఆ ఒక్కరూ తాము మాట్లాడ దలుచుకున్న విషయం గురించిన పూర్వాపరాలు జాగర్తగా పరిశీలించి, చెప్పదలుచుకున్నది క్రమానుగతంగా వివరిస్తారు. అంచేత, వచ్చిన ఏ ఒక్కరూ చివరదాకా కదలరు.... కొందరి మీటింగులు ఈ మధ్య, ఎంతకీ పూర్తిగాక మధ్యలో వెళ్ళిపోవలసి వస్తోంది.

..... 18

"వినోదపు పన్ను రాయతీ వల్ల ఈ పిక్చరు నూరురోజులు ఆడింది. 'సీతారామయ్యగారి మనవరాలు' విషయంలో కూడా టాక్స్ ....

సహాయకారి అయింది. కుటుంబగాథా చిత్రాలని జనావళి ఆది నుంచీ ఆద రిస్తూనే వుంది. జయసుధ నటనా వైదుష్యంలో ఒక ప్రత్యేకత, ఒక విశిష్టత వున్నాయి. జెయస్‌కె కంబైన్స్ తదుపరి చిత్రం కూడా, వెనుకటి మూడు చిత్రాల (ఆదిదంపతులు, కాంచనసీత, కలికాలం) వరవడిని నిలుపుకోగల దనటంలో సందేహం లేదు. నిథిన్ కపూర్, జయసుధలకు నా మనఃపూర్వక శుభాకాంక్షలు" – అన్నారు దాసరి నారాయణరావు, 'వుడ్ లాండ్స్'లో జరిగిన 'కలికాలం' శతదినోత్సవ సభలో. చిత్రంలోని కళాకారులకు, యితర సాంకేతిక నిపుణులకు జ్ఞాపికలంద జేశారు....
పిఆర్‌ఒ : జగన్.

. . . . . 19

ధవళ సత్యం దర్శకత్వంలో లక్ష్మీ రవికిరణ్ వారి (నిర్మాత : భ్రమరాంబా నరసారెడ్డి) 'మన్నెంలో మంగమ్మ' రికార్డింగ్ ముహూర్తం విజయా డీలక్స్‌లో.... ఊర్వశి శారద, శరత్ బాబు, షణ్ముగ శ్రీనివాస్, బ్రహ్మానందం మున్నగువారున్నారు



## 'జగతి' చందా కూపను

2, కచేరి రోడ్డు - పి.బి. 2922
మైలాపూరు- మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బ్యాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు ..............................................................

అడ్రసు ..............................................................

..............................................................

..............................................................

తేదీ : సంతకం

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004



మాటలు, పాటలు : రాజశ్రీ. సంగీతం వాసూరావు. సారథ్యం : మద్ది నారాయణ ; సమర్పణ : ఊర్వశి శారద.... 'కోదండపాణి'లో ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి (ఎవి సుబ్బారావు) పత్రికా సమావేశం.... 'అందములో చందురుడు నీ కులదీపం - చిన్నెలల శ్రీకృష్ణుడు - పేరేమో గోపాల కృష్ణుడు' .... 'వెడ్డింగ్ బెల్స్' అనే నవల ఆధారంగా రూపొందుతున్న ఈ చిత్రంలో నాలుగు పాటలు వుంటాయి .... సిరివెన్నెల పాటలు, చక్రవర్తి సంగీతం.... పిఆర్ఒ : నరసింహం.

## 25

విజయలక్ష్మి ఆర్ట్ ప్రొడక్షన్స్ (నిర్మాతలు : వెంకట్రాజు, శివరాజు) 'సోగాడు'కి ఈ ఉదయం విజయా డీలక్స్‌లో ముహూర్తం. 'స్వామీ, నువ్వు నా వెనుకున్నావన్న ధైర్యంతో ముందుకు వెళ్తున్నాను - నా యీ ప్రయత్నానికి విజయం సిద్ధించాలని దీవించు' - అని రాజశేఖర్ డైలాగ్‌తో, దర్శకులు దాసరి నారాయణరావు చిత్రీకరణ ప్రారంభించారు. కోదండ రామిరెడ్డి స్విచాన్ చేశారు. జంధ్యాల రచన, వేటూరి పాటలు, రాజ్‌కోటి మ్యూజిక్. రాజశేఖర్ ద్విపాత్రాభినయ చిత్రం. సుజాత, శిల్ప, బ్రహ్మానందం, బాబూ మోహన్ మున్నగువారు.

## . . . . . 27

ఇంకా పదకొండు కాలేదు, గంట టైము వుంది కదా, విశ్వేశ్వర్రావు గారిని వారబ్బాయి పెళ్లిలో చూడటమే గాని తర్వాత కలుసుకోలేదు, ఒకసారి చూసి వెళ్దామని, హబిబుల్లారోడ్ సమీపానికి రాగానే, 'విశ్వశాంతి కాలనీకి' - అని చెప్పాను డ్రయివర్‌కి. ఆయన ఫిలిమ్ నిర్మాతగాను, నేను పత్రికా రచయితగాను ముప్ఫయ్యేళ్ల పరిచయం గాక, పది పన్నెండేళ్ల క్రితం షుమాచెర్ రాసిన 'స్మాల్ ఈజ్ బ్యూటిఫుల్' మమ్మల్ని మరింత సన్నిహిత పరిచింది. ఏదో మాటల సందర్భంగా ఆ పుస్తకం పేరు ఎత్తగానే, ఆయన తన డ్రాయరు సొరుగులో నుంచి పుస్తకం పైకి తీసి చూపించారు .... చిన్నప్పటి గుడివాడ రోజులు, ఏలూరు కాలేజీ రోజుల నాటి యూత్ మువ్‌మెంట్, జయప్రకాష్ నారాయణ వల్ల ప్రభావితులవటం, విజయనగరం కాలేజి చదువు, ఉస్మానియాలో చేతికందిన యమ్మెస్సి సీటు జారిపోవడం, గుడివాడలో ట్యుటోరియల్ ఇన్‌స్టిట్యూట్, సినిమాలు చూడని, సినిమాల పట్ల ఆసక్తి లేని వ్యక్తి, పెద్దల ప్రోద్బలంతో డియల్ నారాయణ 'కన్యాశుల్కం'లో సహాయ దర్శకునిగా పని చేసేందుకొచ్చి ఆ పిక్చరయాక వెనక్కి వెళ్లిపోవడం, పి పుల్లయ్యగారు పట్టు పట్టి మళ్లీ రప్పించటం, ఆ పైన ఈ సినీరంగంలో స్థిరపడిపోవటం, ఈ మీడియమ్ సామాజిక చైతన్యానికి ఉపయోగపడాలనే తపన - యిలాటివెన్నో మాటలలో దొర్లాయి. 'జీన్స్' ఇప్పుడు యువతీ యువకులకు ఫాషన్ అయింది

- బొలివియాలోని బొగ్గుగని కార్మికులకు, యితర రంగుల కంటె నీలం రంగులో దళసరివి ఎక్కువ కాలం మన్నుతాయనీ, వాషింగ్ బిల్ ఖర్చు తగ్గుతుందనీ 1861 లో యాజమాన్యం వీటిని ప్రవేశపెట్టింది. చినుగులకి మాసికలు వేసి ఆనాటి కార్మికులు వాడిన నీలం దుస్తులు ఈనాడు ఫాషన్ అయాయి. గార్మెంట్స్ మాన్యుఫాక్చరర్స్, నీలం క్లాత్‌కి కన్నాలు చేసి, ఆ మాసికలు కుట్టి, జీన్స్ తయారు చేసి, వందలూ వేలూ డాలర్ల ఖరీదులో అమ్ముతున్నారు. కాలంతో పాటు విలువలు మారుతాయి ; కాని, ఆ మార్పు వేలం వెర్రిగాను, ప్రగతి నిరోధకంగాను తయారు కాకూడదు' - అన్నారు విశ్వశాంతి విశ్వేశ్వరరావు .... 'పెళ్లిళ్ల చదరంగం' గురించిన మాటలు వచ్చాయి. కాని, అవి స్నేహ ధర్మంలో చెప్పినవి గనక వెల్లడించడం ఉచితం కాదు. గంటంపావు సంభాషణలోని అంశాలు క్లుప్తంగా చెప్పాను. సహృదయులు, సద్భావ చింతనలు, సద్గ్రంథాభిలాషులు, సన్మిత్రులు విశ్వశాంతి విశ్వేశ్వరరావు.

..... 29

"నాతో బాటు అప్లయి చేసిన వారు మరెందరో ఉండగా, నా ఆడిషన్ విని, నన్ను సెలక్ట్ చేసి, ఢిల్లీ పంపి, 'వార్తలు చదువుతున్న జగయ్య'గా నన్ను చేసిన ఆచంట జానకిరామ్ గారికి, నేను సర్వదా కృతజ్ఞుణ్ణి.... కథ అనేది కళలకు కేంద్ర బిందువు అని చెబుతున్న 'కథా వేదిక' ప్రథమ వార్షికోత్సవ సభకు అధ్యక్షునిగా వుండటం ఎంతో సంతోషంగా ఉంది.... మనిషితోనే కథ పుట్టింది. ప్రతి సంస్కృతిలోను కొల్లలుగా కథలు వున్నాయి. అయితే, 'కథానిక' అనే సాహిత్య ప్రక్రియ పాశ్చాత్య ప్రపంచం నుంచి మనకు

వచ్చింది. శిల్ప ప్రాధాన్యమూ, విషయ ప్రాధాన్యమూతో మానవ హృదీతిని పాఠకుని ముందు వుంచుతుంది కథా నిక.... ఈ 'కథా వేదిక' ప్రయత్నాలు విజయవంతమవాలని నా ఆకాంక్ష" - అన్నారు కళా వాచస్పతి జగ్గయ్య, వెంకటేశ్వర కళ్యాణ మండపంలో ఈ సాయింత్రం జరిగిన సభలో! మొదట్లో బికె ఈశ్వర్ స్వాగతం తెలుపగా, ఆ తర్వాత వుప్పల నరసింహం వార్షిక నివేదిక సమర్పించారు. అధ్యక్ష వచనం తర్వాత జలంధర, టిహెచ్ రావు ప్రసంగించారు. ఈ వార్షికోత్సవ సభకు ప్రత్యేక ఆహ్వానితులు; ఆచంట జానకిరామ్; ఆచంట శారదా దేవి.... ముఖ్య అతిథి 'లంకిపల్లె' ప్రసంగం, ప్రత్యేకాహ్వానితులు జానకి రామ్ దంపతుల ప్రసంగాలు వినగల అవకాశం లేకపోయింది - అప్పటికే ఏడుం ముప్పావు అయింది; ఎనిమిదిం టికి వేరే పని ఉంది.... "జానకిరామ్ గారి 'స్మృతి పథం' 'సాగుతున్న యాత్ర' గురించి గాని 'వడ్డాణం', 'మీరు నవ్వరేమి?' వంటి కథానికల గురించి గాని, శారదాదేవి కథానికా సంపుటాలు పగడాలు, పారిపోయిన చిలుక, ఒకనాటి అతిథి, వానజల్లు గురించి గాని వక్తలెవరైనా పేర్కొ న్నారా, వాటి గురించి మాట్లాడారా?" – అని మర్నాడు ఒక మిత్రుని అడి గాను. తనకీ విన్నట్టు జ్ఞాపకం లేదన్నా రాయన.

. . . . . 30

"నేను చదువుకున్నది ఫోర్త్ ఫారమ్ మాత్రమే కాని, శాంతినికేతన్ - గురు దేవ్ టాగూర్‌ది - గాంధీజీ సత్యా గ్రహోద్యమం నన్ను తీర్చిదిద్దాయి. కారాగారాలు మాకు విద్యాలయా లయాయి; ఇతర భాషలు నేర్చు కున్నాము; విశ్వభారతీయుల మయాము.... అనేక తడవలు జైలుకి వెళ్లాను; నన్నెవరూ కొట్టలేదు; లాఠీ దెబ్బ నాకు తెలీదు.... ముప్ఫయ్యేళ్లు నిండకుండా ఈ మద్రాసులో మంత్రి నయాను; ఆంధ్ర ముఖ్యమంత్రి నయాను; కేంద్రంలో మంత్రి నయాను; ఆ తర్వాత ఉత్తరప్రదేశ్ గవర్నరుగా రిటైరై రాజకీయాల నుంచి విరమించుకున్నాను. అప్ప ట్నుంచీ నాది పూర్తిగా సాహితీ రంగం. కవితలు రాస్తున్నాను, అచ్చు వేస్తున్నాను, వినదలుచుకున్నవారికి వినిపిస్తున్నాను .... నేను భారత భారతీయుణ్ణి కాదు - విశ్వభారతీయుణ్ణి .... తెలుగులో యమ్‌ఫిల్, పిహెచ్‌డి చేస్తున్న మీకు యిదంతా ఎందుకు చెబుతున్నానంటే, నన్నయ తిక్కనల వద్ద ఆగిపోవద్దు. ఘనతంతా గతం లోనే ఉన్నదను భ్రమలో జీవించ కండి. రోజు రోజుకీ మారిపోతున్న ఈ ప్రపంచంలో, మన తెలుగు వద్దనే ఆగిపోక, యితర ప్రాంతీయ సాహి త్యాలూ, పాశ్చాత్య సాహిత్యమూ ఎటువంటి నిత్యనూతన పరిణామానికి లోనవుతున్నాయో తెలుసుకోండి. వాటి

సంపద, సత్ప్రభావమూ మనమీద పడ్డప్పుడే తన తెలుగు భాషకు పుష్టీ, చైతన్యమూ వస్తాయి. ముందుకి చూసే వారు తక్కువై, వెనకటి గొప్పలు చెప్పుకొనేవారే అన్ని రంగాలలోను ఎక్కువవుతున్నారు. విద్యారంగం లోనూ అంతే; అధ్యాపకులూ అంతే! పరిశోధక విద్యార్థులైన మీరు, గతం చెట్టు వేరులాటిదనీ, పచ్చటి కొమ్మలూ పువ్వులూ ఫలాలూ భవిష్యత్తు అనీ మర్చిపోకండి," - అని చెప్పారు డా॥ బెజవాడ గోపాలరెడ్డి మద్రాసు యూనివర్సిటీ పిజి సెంటర్ తెలుగు శాఖ పరిశోధక విద్యార్థుల యూనియన్‌కి ప్రారంభోత్సవం గావిస్తూ! ఆచార్య రామచంద్ర, గోపాలరెడ్డి గారిని విద్యార్థులకు పరిచయం చేస్తూ స్వాగతం తెలిపారు. గోపాలరెడ్డి గారి హిత వచనానికి విద్యార్థులు కరతాళ ధ్వనులతో తమ హర్షాతిరేకం వెలిబుచ్చారు.

## అక్టోబరు 01, 1991

"వెంకన్న చౌదరిగారూ వారి కుటుంబం నాకు చిన్నప్పట్నుంచీ తెలుసు. నాకు ఈ సత్కారం జరిపి, నన్ను యింతగా ప్రశంసించడం శ్రీ యార్లగడ్డ రాజ్యలక్ష్మి వెంకన్న చౌదరీ కళా పీఠంవారికి నా పట్లగల ఆదరాభిమానాలకు నిదర్శనం. ఈ ఏభైవేల సొమ్మునీ కెసిపి పాఠశాల లోని పేద విద్యార్థుల ఉపకార వేతనాలకు విరాళంగా సమర్పిస్తున్నాను .... దేశ సంపదను పెంచేవి పరిశ్రమలు. పారిశ్రామిక రంగంలోని వారి సాధకబాధకాలు ప్రభుత్వ యంత్రాంగం సానుభూతితో అర్థం చేసుకున్ననాడు, మన ఉత్పత్తులు పెరిగి, సర్వతోముఖమైన ప్రగతి సాధ్యమవుతుంది. ఇంకో నాలుగు మూడేళ్లలో మన రూపాయికి అంతర్జాతీయ ద్రవ్యవిపణిలో విలువ, గుర్తింపు పెరిగే సూచనలు కనిపిస్తున్నాయి," - అన్నారు ఎంతో ఆశాజనకంగా ప్రముఖ పారిశ్రామికవేత్త వియల్ దత్తు, వెంకన్న చౌదరీ నేషనల్ అవార్డు అందుకుంటూ! వుడ్‌లాండ్స్‌లో జరిగిన ఈ సత్కారసభకు అధ్యక్షులు: సి నారాయణరెడ్డి. పప్పు వేణుగోపాలరావు కార్యక్రమ నిర్వాహకులు. అనుభవజ్ఞులైన మోటూరి సత్యనారాయణ వెనకటి సంగతులు ఎంతో రసవత్తరంగా చెప్పారు. కళాపీఠానికి మేనేజింగ్ ట్రస్టీ అయిన శంభుప్రసాద్ వందన సమర్పణ గావించారు. చల్లబాటువేళ చక్కగా జరిగిన సత్కారసభ, వచ్చే సంవత్సరం దాకా జ్ఞాపకం ఉంటుంది.

## ..... 02

"ఈ శతాబ్ది నలభైలలో గాంధీగారు మద్రాసు వచ్చి, హిందీ ప్రచార సభలో పదిహేను రోజులపాటు వున్నారు. వెయ్యిమంది స్త్రీలు వాలంటీర్లుగా అనాటి ఉత్సవాలలో పాల్గొన్నారు. నాకు హిందీవచ్చు గనక నన్ను, మరో యిద్దరినీ బాపూజీ కుటీరం వద్ద వాలంటీరులుగా నియమించారు.

ఇరవై యేళ్లు నిండని వయసులో నాకు కలిగిన మహద్భాగ్యమది.... 123 ఏళ్లక్రితం ఈ జాతిని మేల్కొల్ప నున్న ఉదయభానుడు పోర్‌బంద రులో జన్మించాడు.... అహింస అంటే ఏమిటో తను అక్షరాలా జీవించి చూపిన మహిమాన్వితు డాయన.... వార్ధా ఆశ్రమంలో కుర్చీలు వుండవు. బ్రిటిష్ ప్రభుత్వంలోని ఒక ప్రము ఖుడు గాంధీగారిని చూడటానికి వస్తు న్నాడు. ఒకకుర్చీ పట్టుకు రమ్మన్నారు గాంధీజీ. ఆశ్రమవాసులు పరుగులు తీసి, ఒక పాతకుర్చీ తీసుకొచ్చి వేశారు. ఆ వచ్చిన బ్రిటిషర్ కుర్చీలో కూచో నన్నాడు. 'బాపూ, మీరు నేలమీద కూచుని వుండగా నేను కుర్చీలో కూచోవడం న్యాయమా? మీకు మల్లేనే నేనూ నేలమీద కూచుంటాను' అన్నాడాయన. 'మాకు నేలమీద కూచోటం అలవాటు; మీకు నేల మీద కూచునే అలవాటు లేదు: నేల మీద కూచోపెట్టానంటే, మిమ్మల్ని హింసించినట్లవుతుంది' అని బాపూజీ అనేసరికి, ఆ బ్రిటిషర్ తెల్లబోయాడు .... అందుకనే బాపూజీ సారధ్యంలో అహింస, ఓటమినెరుగని ఆయుధ మయింది.... 1947 ఆగస్టు 15వ తేదీన స్వాతంత్ర్య పతాకాన్ని ఎవరు ఎగర వేయాలి? నెహ్రూ, పటేల్, ఆజాద్ ముగ్గురూ ఏక కంఠంతో గాంధీ గారిని అర్థించారు. ఆ పవిత్ర కార్యం మీ చేతుల మీదుగా జరగాలి' - అన్నారు. బాపూజీ తన సహజ చిరు హాసంతో 'నేను కాదు - మౌంట్ బాటన్' అనేసరికి, వచ్చిన ముగ్గురూ మొదట్లో కాస్త చిన్నబుచ్చుకున్నా, స్థిమితంమీద అర్థమయింది వారికి గాంధీజీ గొప్పతనం..... ఆ ఏటి కా ఏడు 'ఇది గాంధీపుట్టిన దేశమా? నెహ్రూ నడిచిన దేశమా?' అన్న ట్టుగా పరిస్థితులు మారిపోతున్నాయి.... ఈ గాంధీజయంతి రోజున ఆయన చూపిన వెలుగునే తలుచుకుందాం. అవిద్య, అసహనం, అజ్ఞానం వల్ల చుట్టూ ముసురుకొస్తున్న చీకట్ల జోలికి పోవద్దు," - అన్నారు సరోజినీ వర దప్పన్ పొట్టి శ్రీరాములు హాలులో! సభా ప్రారంభాన 'ఆకాశవాణి' భావ న్నారాయణ, స్వాతంత్ర్య పోరాటం నాటి జాతీయగీతాలు పాడారు..... "గాంధీజీ చెప్పే సత్యము - అహింస అనేవి పైకి సామాన్యంగా కనిపించినా, నిజానికి ఎంతో లోతైనవి. మనిషి నడవడికలోనే కాదు, అంతరంగంలో కూడా మార్పు రావాలి. జీవి, జగత్తు జగదీశ్వరుడు, జీ వి త ము - ఈ నాలుగు కోళ్లూ సక్రమంగా ఉంటేనే పీట కుంటకుండా నిలబడుతుంది. గాంధీజీని తాత్త్విక కోణం నుంచి చూసి నప్పుడు ఆయనలోని కర్మయోగి కని పిస్తాడు" - అన్నారు తోయజాక్షీ దేవేంద్ర.... కార్యదర్శి వైయస్ శాస్త్రి వందన సమర్పణ గావించారు.

,.... 10

అమెరికన్ సెంటర్లో 'ది యస్ట్రా నమర్స్' (The Astronomers) మొదటిభాగం. ఆరు భాగాల ధారా

వాహికలో యిది ప్రధమాధ్యాయం. విరా రుబిన్, లోని టైసన్‌లతోబాటు ఉత్సాహవంతుడైన జాన్ డొబ్సన్ ఈ మహావిశ్వంలోని రహస్యాలను టెలిస్కోపులు, ఎలా రంగులభాషలో అందజేస్తున్నదీ చెబుతాడు. మన సౌర మండలంలాటివి అనేకం ఉన్నాయి - పాలపుంతలూ (Galaxies) అంతే! బిగ్ బాంగ్ (Big Bang) థియరీవల్ల యిది సంభవనీయమయిందా? విస్మయంలో ముంచడమే తప్ప ఏదీ విస్పష్టంగా తెలియదు. మనకి బోధపడక పోవచ్చు. కాని, కనిపించేవి కాదన లేము కదా! జాన్ డొబ్సన్ తన విద్యార్థులకు ఖగోళ విజ్ఞానం చెబుతూ మన మంత్ర పుష్పంలోని ఒకపాదం పేర్కొంటాడు: 'జ్వాలా మాల కులం భాతీ విశ్వస్యాయతనం మహత్' మిగతా అయిదు భాగాలూ తప్ప కుండా చూడాలనే యివ్వాళ అను కోవటం.

## 13

"96 సం॥లు జీవించిన మాస్తి వెంకటేశయ్యంగార్, ఆధునిక కన్నడ సాహిత్యంలో భీష్మాచార్యులంతటి వారు. శతాధిక గ్రంధకర్త. ప్రభుత్వోద్యోగిగా ఆయన కన్నడ ప్రాంత మంతా పర్యటించి, వేరువేరు వర్గాలకు, ఆచారాలకు, నమ్మకాలకు చెందిన మనుషులని స్వయంగా చూశారు; నిశితంగా పరిశీలించారు. వారిలో అనేకులు రూపాంతరం పొంది, ఆయన కథా పాత్రలయారు. ఉద్యోగం చేసి కాలంకంటె పింఛన్ పుచ్చుకున్న కాలం ఎక్కువ. ఏదో చిన్న అభిప్రాయ భేదం వచ్చి, పదవీ విరమణ గావించారు. ఆయన రచనా విధానంలో పాండిత్య ప్రకర్ష గాని, సాహిత్యపు సొగసులు గాని వుండవు. తీసుకున్న యితివృతాన్ని తేలికైన పదాలతో సూటిగా చెప్పడం ఆయన పద్ధతి. కరుణార్ద్రతకు ప్రాముఖ్యమిస్తారు. అందుకనే ఆయన కథలు మనసుని కదిలిస్తాయి. 'చిక్కవీర రాజేంద్ర' కన్నడ సాహిత్యంలో చెప్పుకోదగ్గ నవల. ఆయన రచన లెప్పుడూ మానవతా విలువలకు పట్టం గడతాయి" అన్నారు ఘట్టమ రాజు అశ్వత్థ నారాయణ, మాస్తి శత జయంతి సందర్భంగా, అభ్యుదయ రచయితల సంఘం, పొట్టి శ్రీరాములు హాలులో ఏర్పాటు చేసిన సాహితీ సమావేశంలో, అధ్యక్షత వహించిన శ్రీ విరించి 'మాస్తి కన్నడిగుల ఆస్తి' అన్నారు.

## .....25

"నా సినిమాలు మూడు (అల్లుడుగారు, అసెంబ్లీరౌడీరౌ, డీగారి పెళ్లాం) వరసగా సక్సస్ అయాక, బయటవారి సినిమాకూడా అంతటి విజయం పొందాలని మనసారా కోరుకుంటు న్నాను. యిలాటి కథమీద చాలా కాలంగా దృష్టివుంది. దర్శకులు వంశీ నాకు నచ్చిన కథ చెప్పడం. సమీర్ ఎంటర్‌ప్రైజెస్ యువ నిర్మాత నన్ను అడగడముతో వెంటనే

వొప్పేసుకున్నాను" - అన్నారు మోహన్‌బాబు, 'డిటెక్టివ్ నారద' ప్రారంభోత్సవ సందర్భంగా విజయా గార్డెన్స్‌లో. డి రామానాయుడు క్లాప్ యిచ్చారు. కెయస్ ప్రకాశరావు స్విచాన్ చేశారు.... "మూడు షెడ్యూల్స్‌లో పూర్తి చేదామనుకుంటున్న ఈ చిత్రం నవంబరు ఒకటో తేదీన అరకు వాలీలో ప్రారంభమవుతుంది: మిగతా రెండూ వైజాగ్‌లో చేస్తాము" - అన్నారు నిర్మాత సుధాకర్ రాజు.... కృష్ణ భగవాన్ మాటలు; జొన్న విత్తుల, పైడిపాల, రమణరావు, వంశీల పాటలు, ఇళయరాజా సంగీతం, యమ్వీ రవి కెమెరా.... మోహన బాబు, మోహిని, నిరోషా, జగయ్య, సత్యనారాయణ, రాళ్ళపల్లి, ప్రసాద్ బాబు, మల్లిఖార్జునరావు మున్నగు వారు నటిస్తున్నారు. జేమ్స్ బాండ్ వరవడిలో ఉంటుందని పాత్రికేయులలో ఒకరన్నారు.... పి ఆర్ ఒ: అర్జునరావు.

. . . . 27

"1971 నుంచి 1974 దాకా యాక్టింగ్ అవకాశం లభించక అసిస్టెంట్ డైరక్టరుగా పని చేశాను. మొదట్లో విలన్ వేషాలు; నాదృష్టిలో హీరోకంటె విలన్ పాత్ర క్లిష్టతరమైనది; కాని, ప్రేక్షకుల దృష్టిలో హీరోకే ఆదరణ. హీరో పాత్ర వేసి మెప్పించాలని నా తపన. ఈ రంగంలోకి ప్రవేశించడమూ, హీరో పాత్ర వేయడమూ రెండూ ఛాలెంజిలుగా తీసుకు సక్సెస అయేందుకు శక్తి [illegible] కృషి చేశాను. యాక్టింగూ, డైలాగ్ డెలివరీ, భావ ప్రకటన - వాటిలో నేను నిరంతర సాధకుణ్ణి. బాగా వేసినా, యింకా బాగా వేయవచ్చునేమోననే తలంపు నన్ను వొదిలిపెట్టదు. అల్లుడుగారు, అసెంబ్లీ రౌడీ, రౌడీగారి పెళ్లాం ఒక సంవత్సరం వ్యవధిలో విడుదలయాయి - మూడూ వరసగా ఘనవిజయం పొందాయి. కాగా, ఆర్థిక విజయమేనా నటనా కౌశలానికి కొలమానం? ఎ ఎన్ ఆర్, ఎమ్ జి ఆర్, ఎన్ టి ఆర్, శివాజీలతో పోలిస్తే నేను సాధించనదే పాటి [illegible]రి వెదుష్యం ముందు నా సామర్థ్యమెంత?.... ఒక చిత్రం విజయం పొందిందీ అంటే, అది హీరో హీరోయినలకు ఆపాదించనక్కర్లేదు. ఎందరో కలిసి కట్టుగా చేసిన టీమ్ వర్క్‌కి ఫలితమది.. ఫిలిమ్ ప్రొడక్షన్ ఒక వ్యాపారం; నిర్మాత, కొనుగోలు దారులు నిలబడాలి, బాగుపడాలి.... నాగేశ్వరరావుగారు ఒకసారి చెప్పారు: 'నేను నటించిన సినిమా ఫ్లాప్ అయిందంటే, ఒక వారం రోజులు నిద్ర పట్టేది కాదు - ఆ నిర్మాతని తలుచుకు! అదే దిగులుతో కుంగి పోవడానికి జీవితం సమ్మతించదు. అంచేత, మళ్లీ కొత్త కధ, కొత్త సినిమా, కొత్త ఆశ' ....నేను ఈ రంగంలో నిలబడటానికి చేయూత నిచ్చినవారు ముగ్గురు - దాసరి నారాయణరావు, కె రాఘవేంద్రరావు, కె యస్ ఆర్. దాసు....

వేదు నిజాలు తెలుసుకుంటూ ఎగుడు దిగుళ్లు అనుభవించాను. కాని, నిజాయితీ నా ఊపిరి. యత్నం, ప్రయత్నం, దైవానుగ్రహం - ఈ మూడూ అనుకూలించిన మీదటే అనుకున్న పని నెరవేరుతుంది.... ముఖం తప్పించే నిర్మాతలు వున్నారు గాని జర్నలిస్టు సోదరులకు నాపట్ల మొదట్నుంచీ అభిమానమే. మిగతా భాషలతో పోల్చి చూస్తే, మన తెలుగు జర్నలిజమ్ ఎంతో ఆరోగ్యవంతమైనది; వ్యక్తిగత విషయాల జోలికి పోదు; ఈ పరిశ్రమని ఒక విస్తృత కుటుంబంగా భావిస్తుంది....." - అన్నారు మోహన్‌బాబు యమ్మెమ్ థియేటర్లో, తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్ వారు ఏర్పాటు చేసిన అభినందన సమావేశంలో.... సెక్రటరీ జగన్ స్వాగతం తెలుపగా, అసోసియేషన్ అధ్యక్షులు జగదీష్‌బాబు, స్వయంకృషితో పట్టుదలతో మోహన్‌బాబు ఎలా పైకి వచ్చినదీ చెప్పారు. విలన్‌గాను హీరోగాను ప్రేక్షకుల అభిమానం పొందిన గొప్పనటుడని పాటిబండ్ల విజయలక్ష్మి, క్రమశిక్షణకు కట్టుపడిన వ్యక్తి అని చలసాని గోపి, ఈ పదహారేళ్లలో ఆయన రూపరేఖల్లో ఎటువంటి మార్పూ లేదని అర్జునరావు మోహన్‌బాబుని కాంప్లిమెంట్ చేశారు.... అతిచిన్న మొత్తం అంటూ ఇరవైవేలు అసోసియేషన్ బిల్డింగ్ ఫండ్‌కి విరాళంగా యిచ్చారు మోహనబాబు.

—యన్నార్ చందూర్

ప్రస్తుత సినిమాలు

# హింస - దౌర్జన్యం

## ప్రోత్సహిస్తున్నాయా ?



'ప్రస్తుత సినిమాలు హింసని, దౌర్జన్యాన్ని ప్రోత్సహిస్తున్నాయా ?' ఈ ప్రశ్న ఎవరైనా ప్రొడ్యూసర్‌ని అడగండి : 'మేము హింసని, దౌర్జన్యాన్ని ప్రోత్సహిస్తున్నామా ? ఎంత మాట ! అయిన దానికీ కాని దానికీ సినిమా వారి ననడం ఫేషనైపోయింది. సంఘంలోని కుళ్లునీ, అవినీతిని, కిరాయిగూండాలని, అధికార స్థానాలలో ఉన్న వారి మద్దతుతో ఈ గూండాలు చేసే ఘాతుకాలని, కిరాతక చర్యలని వెల్లడి చేసి, సంఘం ప్రక్షాళితం గావాలంటున్నాం. తమ పేరు పైకి పొక్కకుండా, పెద్దలు చేయించే తప్పుడు పనుల వల్లనే సంఘ స్వరూపం యింత దిగజారి పోయింది. సినిమా నిర్మాణం ఒక వ్యాపారం గనక, వ్యాపార సూత్రాలకు, సెన్సార్ నిబంధనలకు, ఎన్నో కష్ట నిష్ఠూరాలకు లోబడి, మేము పిక్చర్ రిలీజ్ చేస్తాము. సమాజ శ్రేయస్సుకీ న్యాయ సూత్రాలకు భిన్నంగా మేమెప్పుడూ నడుచుకోము. సామాజిక బాధ్యత మాకు మాత్రం లేదా ? ప్రజల మంచి చెడ్డలు మాకు తెలియవా ? సామూహికంగా మేలు జరగాలనే ధ్యేయంతో సామాజిక వాస్తవికతను చూపిస్తూ, సినిమా కళ ద్వారా యితోధికంగా కృషి చేస్తున్నాం' - అంటారు సినిమా వారు.

ఇదే ప్రశ్న - నేటి సినిమాలు హింసనీ దౌర్జన్యాన్నీ ప్రోత్సహిస్తున్నాయా అనే ప్రశ్న - ఒక సామాన్య కుటుంబీకుని అడగండి 'నిస్సందేహంగా' అంటాడు. "సినిమాలు చూసి దొంగతనాలు నేర్చుకుంటున్నారు ; అత్యాచారాలు చేస్తున్నారు. కనీ వినీ ఎరుగని దారుణాలకు పాల్పడుతున్నారు. ఏడెనిమిదేళ్ల పిల్లలు సైతం, హీరోల్లా పోజుపెట్టి తలిదండ్రులని ఎదిరిస్తున్నారు. కలబడి కొట్టుకోవడం రక్తం కళ్లజూడటం తమ శౌర్య ప్రతాపాలకు చిహ్నంగా భావిస్తున్నారు. సంఘ విద్రోహులు వెండి తెరమీద కనిపించే నరహంతక చర్యలు చూసి, ప్రావీణ్యత సంపాయించుకుంటున్నారు. 150 నిముషాల సినిమాలో 140 నిముషాల పాటు 'వైలెన్స్'ని గ్లామరైజ్ చేసి, చివరి పదినిముషాలలో 'సత్యం జయిస్తుంది' అని చెప్పి ప్రయోజన

మేమిటి? మంత్రులని, శాసన సభ్యుల్ని, ఉన్నతాధికారులని, పోలీసు శాఖని, పారిశ్రామికులని - అందరినీ దగుల్బాజీలుగా చిత్రిస్తూ, తమ హీరో ఒక్కడే అవతార పురుషుడైనట్టూ, హింసని ప్రతి హింసతోను, దౌర్జన్యాన్ని ప్రతీకారంతోను చీల్చి చెండాడి, విజయం సాధించి, తనతో పాటలు పాడిన అమ్మాయిని పెళ్లి చేసుకోవటమో, లేక, మరు జన్మలో కలుసుకుందామని హామీ యిచ్చి, వీరస్వర్గం పొందడమో! ఇదీ నేటి చిత్రాల ధోరణి'' - అంటాడు సగటు పౌరుడు.

కాగా, మనకు యిరువురు చెప్పిందీ నిజమేననిపిస్తుంది. ఒకప్పుడు శ్రవ్య కావ్యం కంటె ధృశ్య కావ్యం గొప్పదన్నారు. ఈ 20వ శతాబ్ది సినిమా కావ్యానిది. మొదట్లో దీనికి మాటలు చేతకాలేదు ; ఇరవైయ్యేళ్లు వచ్చేసరికి మాటలు వచ్చాయి. 'జాజ్ సింగర్'తో ఇంగ్లీషు పాటలూ, 'ఆలమ్ ఆరా'తో హిందీ పాటలూ మాటలూ నేర్చుకున్న సినిమా, ముప్ఫయిల్లోనే పదిహేను భారతీయ భాషల్లోకి విస్తరించింది ; నాటకాల వరవడిలో చిత్రాలు, సామాజిక యితివృత్తాలూ, సాంఘిక చైతన్య ప్రబోధకాలు... యిలా రాను రాను కళాదృష్టి, వ్యాపార లక్ష్యమూ సమ్మిళితమయాయి. అవార్డులకోసం తీసే ఆర్ట్ ఫిలిమ్ వేరు, డబ్బు గడించేందుకు తీసే కమర్షియల్ ఫిలిమ్ వేరు - అని సినీ నిర్మాతలు స్పష్టంగా వొప్పుకుంటున్నారు. 'సెన్సార్ కట్' అనేది ఒక్కటి కూడా లేకుండా న్యూ థియేటర్స్ వారు 150 సినిమాలు తీశారు. ఈనాటి ఏ నిర్మాతలు ఆ స్థాయిలో లేరు. అందుకు కారణం కాల ప్రభావం, వ్యాపార దృక్పధమూను. పాతికేళ్ల క్రితం, యింకా ఎక్కువేనేమో, మన దేశానికి, 'హౌస్ ఆఫ్ వాక్స్' అనే ఫిక్చర్ వచ్చింది. వాక్స్ అంటే మైనము, ఆ ఫిక్చర్ లోని విలన్, కరుగుతున్న లక్కలోకి ఒక మనిషిని తోసేస్తాడు - అతి భయానక దృశ్యమది.... ఆ సినిమా చూసిన ఒక సామాన్య ఉద్యోగి, పేదరికం భరించలేక, బొంబయిలోని తమ ఫాక్టరీలో, మరుగుతున్న ద్రవం గల ఒక పెద్ద కళాయిలోకి దూకి ఆత్మహత్య గావించుకుంటాడు.... ఈ వార్త వెలువడ్డాక స్వర్గీయ బాబూరావు పటేల్ తన పత్రికలో యిటువంటి చిత్రాల దిగుమతి నిషేధించాలన్నాడు. జేబుదొంగని గ్లామరైజ్ చేస్తూ తీసిన 'కిస్మత్'ని - అశోక్ కుమార్ అందులో హీరో - దానిని కూడా ఆయన తీవ్రంగా విమర్శించాడు.

భారతీయ చిత్రాలలో హింసా దౌర్జన్యాలకు నాంది పలికినది 'షోలే' హిందీ చిత్రం. అన్ని భాషలలో ఆ వరవడి ప్రారంభమయింది. ఈ శతాబ్ది ఏడవ దశకంలో, అంటే డెబ్బయిలలో, వ్యక్తుల కిడ్నాపింగూ విమానాల హైజాకింగూ సర్వసామాన్యంగా ఉండేవి. లండన్‌లోని లాయడ్స్ బాంక్, భాగ్యవంతుల 'కిడ్నాపింగ్ యిన్సూరెన్స్' ఆమోదించేదట. అయిదేళ్ల కుర్రాడిని ఒక రౌడీ

ఎత్తుకుపోయి, 2 కోట్ల 70 లక్షలు చెల్లించి విడిపించుకోమని కబురు పెట్టాడట. పాశ్చాత్య లోకం నుంచి అన్నీ నేర్చుకున్నట్టే, యివీ మనం నేర్చుకుంటున్నాం. ఎటొచ్చీ మన దేశంలోని కిడ్నాపింగ్‌కి వేర సారాలు వేరు; డబ్బుతో బాటు రాజకీయం.

సినిమాలలో సెక్స్‌కి గల ప్రభావం డెబ్భయిలతో సమసిపోయింది. ఎనభైలలో 'వైలెన్స్'ది అగ్రపీఠం - అనగా హింసా దౌరన్యాలది. ప్రేక్షకాభిమానులు తమ సూపర్‌స్టార్ అద్భుతాలు చేయాలని ఆశిస్తారు. తన అభిమానుల సంఖ్య పెంచుకొనేందుకు, కాపాడుకునేందుకు సూపర్‌స్టార్, ఈ పోటీ ప్రపంచంలో, తన శక్తి వంచన లేకుండా శ్రమిస్తాడు.

ద్వంద్వార్థాలని, అశ్లీలాలని ఒక వర్గం ప్రేక్షకులు ఆనందిస్తారని యిప్పటికీ కొందరు నిర్మాతల నమ్మకం. ఏది డబ్బు తెస్తుందో అదే గొప్ప చిత్రమనే అభిప్రాయం పదిహేనేళ్లగా పాతుకుపోయింది - తెలుగు సినిమా ప్రపంచంలో! రౌడీలకు రౌడీ, మోసగాళ్లకు మరింత మోసగాడు, దొంగలకు గజదొంగ, వంచకులకు మహా వంచకుడు - ఈ విధంగా హీరోని రూపొందించి, అతని హింసా దౌర్జన్యాలను సాహసోపేత కార్యాలుగా చిత్రిస్తున్నారు. తెరమీద కనిపించే ఫైటింగ్‌లో, హీరోలకు సమ వుజ్జీలమంటూ హీరోయినులు కూడా ముందుకొచ్చారు.

హింసా దౌర్జన్యాలకు ప్రతీకలైన రెండు చిత్రాలు మచ్చుకి. లేడీస్ ఫస్ట్ గనక, మొదట హీరోయిన్‌ది చెబుతాను....పోలీసు డ్రస్ వొంటికి పట్టుకునుండే గ్లామర్ క్వీన్, సబినస్పెక్టరో, సర్కిలో, ఎయస్‌పి యో మనకి తెలీదు .... పిక్‌పాకెట్ నుంచి స్మగ్లర్ కింగ్‌గా గ్రాడ్యుయేషన్ పొందిన నేరస్తుని పట్టుకునేందుకు, ఆమె అనేక విధాల తంటాలు పడుతుంది. ఎక్కడికక్కడ తన మనుషులచేత రాక్షస కృత్యాలూ హత్యాకాండలూ జరిపిస్తూ, ఈ చట్టాలూ న్యాయస్థానాలూ మమ్మల్ని ఏమీ చేయలేవు, మేము వీటికి అతీతులం, పేదలకు రక్షణ నిచ్చేది నా వంటి 'గాడ్ ఫాదర్లే' అని చెబుతూ, ఆమె పట్టుదల, కార్యదక్షత, తన పట్ల ప్రేమ దీపమయేదాకా తీసుకొస్తాడతను. కాని, చివరికి న్యాయం జయిస్తుంది.... 'ఒక పోలీసాఫీసరేమిటి, క్రిమినల్‌ని ప్రేమించడమేమిటి, యిది సంభవనీయమా, కించిత్తయినా వాస్తవికత ఉందా ?' - యిలాటివి అక్కర్లేని ప్రేక్షకులే, హీరో హీరోయిన్‌ల మీద వెర్రిమోజుతో ఈ హింసా దౌర్జన్యాల చిత్రాలను ఆదరిస్తున్నారు.

హీరో పిక్చరొకటి చెబుతాను. తలిదండ్రులెవరో తెలియని అనాథ బాలుని, ఒక మేస్టారు చేరదీసి చదువు చెప్పిస్తాడు. పరిస్థితుల ఫలితంగా ఆ మేస్టారు ముఖ్యమంత్రి అవుతాడు; ఈ అనాథ బాలుడు పోలీసు

ఇనస్పెక్టరవుతాడు. ముఖ్యమంత్రి, ముక్కుకు సూటిగా పోయే మనిషి. కాని, అతని చుట్టూ దగాకోరులు, గోతులు తీసే వారూను. ఎన్నో ఘోరాలు జరుగుతుంటాయి. కళ్లెదుట విద్రోహ శక్తులు విలయ తాండవం చేస్తాయి. చివరికి ముఖ్యమంత్రికి సైతం ఈ పోలీసాఫీసరుపై విసుగు పుడుతుంది; కాని, యితను మాత్రం మేస్టారుని బాంబు ప్రమాదం నుంచి కాపాడి, ఈ ప్రపంచాగ్నికి సమిధ అవుతాడు.... ఇందులో హింసా దౌర్జ న్యాలు ఉన్నప్పటికీ లక్ష్యసాధన ప్రధానమవటం వల్ల, ట్రాజడీ అవటం వల్ల ప్రభావం తక్కువగా కనిపిస్తుంది. తెలుగులోనే గాక హిందీలో కూడా అఖండ విజయం సాధించిన చిత్రమిది.

ఒకప్పుడు సినిమాలలో కామెడీ విధిగా ఉండేది - నాటకంలో విదూష కునిలా! ఆ తర్వాత హీరోగారి 'మాన్లీ నెస్' తెలిపేందుకు ఫైటింగ్, కత్తి యుద్ధాలు, కర్ర యుద్ధాలు, ముష్టి యుద్ధాలు, తర్వాత పిస్తోళ్లతో - ఆ మీదట హేండ్ గ్రెనేడ్స్, బాంబుల తో! దుష్ట బుద్ధిగల విలన్, సంఘ విద్రోహి అయిన స్మగ్లర్‌గా మారాడు.

సినిమా వారు హింసా దౌర్జన్యా లను కొంతమేర గ్లామరైజ్ చేస్తున్న మాట నిజమే! అవి సంఘంలో లేవని, వారి కల్పితాలనీ కూడా పూర్తిగా అనలేము. వ్యాపార విజయం కోసం, తమ సామాజిక బాధ్యతను విస్మరించడం లేదా? - చర్చనీయాంశం. ప్రజావాణి మేల్కొని, ప్రజాభిప్రాయం వ్యక్తం చేయగలిగినప్పుడే, ఈ పరిస్థితులు మారుతాయి.

'ఏ కళాస్వరూపమైనా సద్విమర్శ నుంచి ప్రాణం పోసుకుంటుంది. సినిమా కళకు మెప్పులే గాని విమర్శ లక్కర్లేదు' - అని ఫిలిమ్ హిస్టోరి యన్ పాల్ రోతా ఏభై ఏళ్ల క్రితం చెప్పాడు. ఈ నాటికీ ఆ మాట వర్తిస్తుంది అక్షరాలా!

—యన్నార్ చందూర్

'ఆకాశవాణి' సౌజన్యంతో
మద్రాసు కేంద్ర ప్రసారితం
నవంబరు 9, 1991

కోరికకు గల నేత్రాన్ని 'జ్ఞానం' అంటాము. అదే ఆత్మకు చుక్కాని కూడా కాగలదు.

—విల్ డురాంట్

ఆకుపై నీటి బిందువు నర్తించి నట్లు, కాలపు అంచుపై జీవితాన్ని నర్తింపజేయాలి.

—టాగూర్

చదవటం ఎక్కువైన కొద్దీ, మన తెలివిలేమిని తెలుకుంటాం.

—షెల్లీ

ఏది న్యాయమో తెలిసికూడా ఆ ప్రకారం చేయలేకపోవటం భీరుత్వం.

—కన్‌ఫూషియస్

పద్మ సత్యా వారి

# 4 2 0
# ఫోర్ ట్వంటీ

విశాఖపట్నం విమానాశ్రయంలో కేరళ పోలీసులు ఒక ముఖ్య ఖైదీని. నకిలీ సూపరెంటుకి వొప్ప జెప్పడంతో, ఉద్యోగాలు వూడి, తోపుడు బండీ కొట్టుతో, ఎలాగైనా ఆ మోసగానిని ఆంధ్రా పోలీసులుగాక, తామే పట్టుకొనేటట్టు చేయమని గురువాయూరప్ప కటాక్షం కోసం చూస్తూ వుంటారు. చివరికి వారి కోరిక నెరవేరడమూ, వారిలోనే మానవత్వం దయాగుణం మేల్కొనడమూ ఈ చిత్ర కథలోని తుదీ మొదలూ. నకిలీ సూపరెంటు ఆ ముఖ్య ఖైదీని ముఠా నాయకునికి వొప్పగించి, తన కిరాయి వసూలు చేసుకుంటాడు. మోహనదాస్ కరమ్‌చంద్ గాంధీ అని 'ఫోర్‌ట్వంటీకి' (చిరంజీవి) వాళ్ల తండ్రిగారు పెట్టిన పేరట. నీతిగా నిజాయితీగా బతికిన ముగ్గురు గాంధీలను చంపిన ఈ దేశంలో వాటికి విలువలేదని, చిల్లర బేరాలతో సెంట్రల్ జైలుకి వస్తూ పోతూండగా రాష్ డ్రయివింగ్‌లో ఆరుగురుని చంపిన యజమాని నేరం తన మీద వేసుక ఉరిశిక్షకు గురి కానున్న చంద్రం (చంద్రమోహన్), నువ్వు న్యాయంగా బతుకుతూ నలుగురిని బతికించాలని చెప్పిన ఉపదేశం, యితనిలో మార్పు తెస్తుంది. జైలు నుంచి బయట కొచ్చాక, తన వద్దనున్న డబ్బు బాంకులో వేసి, యిక మీదట సుజన జీవనం సాగించాలనుకోగా అదే సమయాన బాంకు దోపిడీ జరిగి, ఆ నేరస్తునితో బాటు ఈ ఫోర్ ట్వంటీ కూడా ఇరుక్కుంటాడు. హెడ్ కానిస్టేబుల్ నుంచి ప్రమోట్ అయిన సబిన్‌స్పెక్టర్, మరొక ప్రమోషన్ సంపాదించాలని, ఫోర్ ట్వంటీని తన ముగ్గురు భటులతో వెంటాడుతాడు. బాంక్ దోపిడీ చేసినది ఎవరయ్యా అంటే తనకి మంచి మార్గం చూపిన చంద్రం తమ్ముడు. చంద్రాన్ని ఉరితీయగా అతని భార్య కిరసనాయిలు పోసుకు సహగమనం చేయగా, మూడేళ్ల పసిది మూగదైపోతే, మద్రాసు అపొల్లోలో ఆపరేషన్ చేయించేందుకు పట్నంలో బాంకు దోపిడీ చేశాడు తమ్ముడు (శుభలేఖ సుధాకర్). చివరికా సొమ్ము పసిదాని 'పాప'తో బాటు పోలీసుల వశమవుతుందనుకోండి. గ్రాంధికం మాట్లాడే 'బ్రాతెల్'

యజమానురాలు, ముఠా నాయకుడు, తరుముకొచ్చే పోలీసులు, హీరో సాహసచర్యలూతో అవాస్తవికతలో అద్భుతరసాన్ని పోషించి హాస్యం చిల కరించిన చిత్రమిది. నిర్మాత : సత్య కుమార్ : దర్శకత్వం : సత్యనారా యణ ; సమర్పణ : జయకృష్ణ.... పి ఆర్ ఒ : రాజు.

యమ్‌యస్ ఆర్ట్స్ వారి

'ఆగ్రహం'

అంధుడైన తన తమ్మునితో మూడు నెలలు గడిపేందుకు ఆర్మీ కెప్టెన్ విజయ్ (రాజశేఖర్) హైదరా బాదు వస్తాడు. డిపార్ట్‌మెంటర్ స్టోర్సులో తటస్థ పడ్డ సుందరాంగి (అమల), తన మీద కథలల్లి తమ్ము నికి నమ్మకంగా చెప్పి, వొదినగా తన స్థానం గట్టి పరుచుకుంటుంది. దోబూ చులాడేందుకు తప్ప కాపరానికి రాదనుకున్న అల్లరి పిల్లలోని ఆంత ర్యం, అనురాగ ధార గ్రహించి, ఆ అమ్మాయి తలిదండ్రుల అనుమతితో పెళ్లికి వొప్పుకుంటాడు. అయితే, ఆఖరుక్షణాన రిజిస్ట్రారాఫీసులో, ప్రతిపక్ష సభ్యులతో బాటు అమాయకు లైన పిల్లల్ని సైతం దారుణంగా బలి గొననున్న బాంబు ఉదంతం తెలిసి, ఆ ప్రమాదం నివారించేందుకు హడా విడిగా పరిగెడతాడు. కక్షతో అల్లుడినీ, ఓట్లకోసం కన్నకూతురినీ చంపించిన ముఖ్యమంత్రి, పోలీసు శాఖను తన గుప్పెట్లో పెట్టుకు ప్రజా స్వామిక విధానాన్ని రౌడీ రాజ్యంగా మార్చిన రాష్ట్రాధినేత : అనేక సాహస కార్యాలతో బాటు హెలికా ప్టర్ యుద్ధంలో విజయమంది, కడపటి సాక్షి అయిన బాంబుల భీమయ్యని పట్టుకొచ్చి, అతను టేబుల్ మీద మరణించగా, విజయ్ కుప్ప కూలి పోతాడు. సారా వ్యాపారం నుంచి ఎదిగి, ముఖ్యమంత్రి పదవి నందుకున్న మనిషి విషపు నవ్వుతో, అంటాడు విజయ్‌ని ఉద్దే శించి : 'అమాయకుడైన మిలిటరీ వాడా, ఈ గవర్నరు, ఈ జడ్జీ, ఈ ప్రతిపక్ష నాయకుడూ - వీరందరికీ తమ పదవులూ పలుకబడీ ముఖ్యం. మండలాలూ, జిల్లాలూ కాదు - రాష్ట్రాలు సైతం అమ్మేస్తాం - అది మా యిష్టం. నువ్వెవడివి అడిగేం దుకు ?'.... తనెవరో చెప్పేందుకే అన్నట్లు, ముఖ్యమంత్రిపై గుళ్ల వర్షం కురిపించి, పోలీసాఫీసరు వైపుగా చేతులు చాచి సంకెళ్లు వేయ మంటాడు విజయ్. రాజశేఖర్ తన పాత్రను అద్వితీయంగా పోషిం చాడు ; అమల వెన్నెల కాంతులు చిమ్మింది, పాటలూ మ్యూజిక్ ప్రశంస నీయంగా ఉన్నాయి. విజయ్‌ని ఒక పెద్ద సినీహీరోగా చిత్రించాలను కున్నారు గాని సెలవు మీద వచ్చిన మిలిటరీ ఆఫీసరుని ఒక సామాన్య సబినస్పెక్టర్ ఎలా అరెస్టు చేయ గలడు ? మిలిటరీ డాక్టర్లు పరీక్ష చెయనిదే విజయ్‌ని పిచ్చాసుపత్రికి ఎలా పంప గలుగుతారు ? ఒక సర్వెంట్ గాని, ఒక బంధువుగాని

లేకుండా, గుడ్డి తమ్ముడు అంత పెద్ద యింట్లో ఎలా బతకగలిగాడు? భర్తను చంపించిన తండ్రిపై కక్షబూనని స్త్రీ ఉంటుందా? పగతీర్చుకొనే అవకాశం విజయ్ ద్వారా లభించినప్పుడు ఆమె ఎందుకు వెనకాడినట్లు? ప్రతి పక్ష నాయకుని మాట ఎటున్నా, జడ్జీగారూ గవర్నరూ యింకొంచెం ఉదాత్తంగా ఉండాలనిపిస్తుంది. రాష్ట్ర ముఖ్య మంత్రుల మీద మళయాళంలోను, తెలుగులోను చాలా చిత్రాలు వచ్చాయి. ఇందులో గల ప్రత్యేకత ఏమిటంటే, దేశభక్తి తన రక్తంలో జీర్ణించిన ఒక సైనికాధికారి, ఎల్లలు కాపాడటమేగాక, ప్రజా జీవనంలోని పాప పంకిలాన్ని తుడిచి పెట్టేందుకే పూనుకోవడం.... సమర్పణ; యమ్మెస్ రెడ్డి; నిర్మాత: శ్యామ్ ప్రసాద్ రెడ్డి; దర్శకత్వం: కెయస్ రవి... పి ఆర్ ఓ మెరుపు కృష్ణ.

## నవీన్ ఆర్ట్ వారి 'ఏడు కొండల స్వామి'

సీతరామ చరితం, వెంకటేశ్వర మహత్యం తెలుగు వారి కెప్పుడూ అభిమాన పాత్రమైన పౌరాణిక గాథలు. దర్శకులు కమలాకర కామేశ్వరరావు ఈ సుపరిచిత యితి వృత్తానికి ఒక కొత్త మలుపు, ఒక కొత్త తళుకు తెచ్చారు. సమర్థులైన దర్శకులు ఎంత పాత విషయమైనా, కొత్త పుంతలలో నడిపించ గలరనీ, నవనవోన్మేష కాంతులతో ప్రేక్షక హృదయాన్ని ఆకట్టుకో గలరనీ, చెప్పేందుకు ఈ చిత్ర మొక ప్రబల దర్శనం.... వరాహ శాస్త్రి గొప్ప జ్యోతిష వేత్త - ఆయన భార్య కూడా ఆ శాస్త్రంలో ప్రవీణురాలే. కాశీ నుంచి వస్తూ, ఒక సంపన్న గృహస్తు వద్ద ఆగి, వారి పెరటింట్లో ఆతిథ్య మర్యాదలు పొందుతున్నప్పుడు, జయంతీ జయంత్‌ల వివాహ ముహూర్తం పెట్టమంటారు. వారి జాతకాలు పరిశీలించి లగ్నం నిర్ణయిస్తాడు శాస్త్రి. 'ఈ పొంతనలో దోషం ఉన్నట్లు తోస్తోంది. వరునికి ఆయుక్షీణమవుతుందేమో' నంటుంది భార్య. పునః పరిశీలన గావించి, శనేశ్వరుడు అడ్డు తగులుతున్నాడు, శాంతులతో అతని ప్రభావం అరికట్ట వచ్చు, - ఇది బ్రహ్మముడి, దీనిని ఎవరూ ఆపలేరు — అంటాడు శాస్త్రి.... ఈ శనేశ్వరుని వెనకటి కథ ఏమిటంటే, నీలాద్రి, శేషాద్రి, వృషభాద్రి, అంజనాద్రిలులా ఏడు కొండల మీద తన ప్రతాపం చూపి, వెంకటాద్రిలోని శ్రీనివాసుని దగ్గరకెళ్లేసరికి ఆయన ఒక్క తాపు తంతాడు. తన బలం నీరు కారిపోగా, శనేశ్వరుడు ఘోర తపస్సు చేసి, శ్రీనివాసుని ప్రసన్నుని చేసుకుంటాడు. శనివారం అవిధంగా ఏడు కొండల వానికి ప్రీతికర మవుతుంది.... కలియుగ వైకుంఠ వాసుని అభయ రక్షణ వున్న జయంత్‌ని యముడు సైతం ఏమీ చేయలేక పోతాడు. సంగీతం ఇళయరాజా. నిర్మాత: నవీన్ వడ్డే.... పి ఆర్ ఓ: రాజు.

సీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత

గడిచిన : సివిల్ ఇంజనీరు విశాలకు, డాక్టరు నాగార్జునకు వివాహం నిశ్చయమయింది. విశాలను దుండగులు ఎత్తుకు పోవడం, హాస్పిటలైజేషన్, ప్రమాద కారణంగా కాళ్లు చచ్చుబడి చక్రాల కుర్చీ వాడవలసి రావటం, చెల్లెళ్ల కోసం స్కూలు పెట్టడం.... నాగార్జున చెల్లెలు చందనకు విశాల అంటే ప్రాణం. అతని పెళ్లి యింకొన్నాళ్లు వాయిదా పడటం వల్ల, చందనకు ముహూర్తం పెట్టారు....

(ఇక చదవండి

"అవునమ్మా, విశాల, నీవు రావలసిందే – నిన్ను పూల మీద నడిపించుకు వెళ్ళాల్సింది పోయి, ఇలా కన్నీళ్ళతో పిలవవలసి వచ్చింది. డాక్టర్నడిగాము నిన్ను మెల్లగా కారులో కూర్చోబెట్టి తీసుకెళ్ళమన్నారు" రాజేశ్వరి అప్యాయతకు ప్రమీల కళ్లల్లో నీటి చుక్కలు నిలిచాయి.

✠ ✠ ✠

పెళ్ళి పందిట్లో లావణ్య, అంతా తన స్వంతమే అయినట్లు, అందరిని మర్యాదలు హడావుడిగా చేస్తుంటే, రాజేశ్వరి కళ్ళు ఆ అమ్మాయి మీద నిలిచాయి. లావణ్య ఏమీ తక్కువ అందగత్తె కాదు, ఆమెకు అన్నీ వున్నాయి. గుణం, చదువు, అందం గొప్పింటి పిల్ల. నాగార్జునకు తగినజోడి అనిపించేది రాజేశ్వరికి ఒక్కోసారి! విశాల మంచిదే, అయితే ఆ అమ్మాయి ఆరోగ్యం బాగవుతుందో లేదో, ఒక వేళ బాగకాకుంటే నాగార్జున జీవితాంతం ఒంటరివాడేనా....? నాగార్జునకు నచ్చ చెప్పాలి - లావణ్యను చేసుకోమని.

విశాల కూడ ఆ పెళ్ళి పందిట్లోనే వుంది. నడవలేని స్థితి అయినప్పటికీ ఆమె ప్రసన్న వదనం గంభీరంగా ఉంది.

నాగార్జునకు శ్రీనివాసరావుకి; ఆందోళనగా వుంది లావణ్య విషయం. ఈ పెళ్ళిలో మళ్ళీ స్పృహ తప్పిపోతుందేమో అని. వద్దని చెపితే ఆమె భాద పడుతుందని వారించలేదు కాని, ఆమెను ఓ కంట కని పెట్టే వున్నారు వారిద్దరూ.

పెళ్ళితంతు ముగిసింది. వధూవరులిద్దరూ తలంబ్రాలు నెత్తిన పోసుకుంటున్నారు. విశాల అదంతా చూస్తోంది. తన జీవితంలో ఆ మధుర

గడియలు అతి చేరువుగా వచ్చి ఆగి పోయాయి. విష పురుగు లాంటి రాజేష్‌ని ఇంట్లో చేరనిచ్చాడు అమాయకుడైన తండ్రి. తెలియ కుండానే కళ్ళల్లో బాష్పాలు నిలి చాయి.

ఎదురుగా నాగార్జున కనిపించాడు. విశాలనే చూస్తున్న అతని చూపులు, ఆమె హృదయాన్ని చల్లగా తాకాయి. మనసంతా హాయిగా తృప్తికరమైన ఓదార్పు లావణ్య వునికిని ఆ క్షణంలో గమనించలేదు.

అనిర్వచనీయమైన అంతర్వేద నగు గురిఅయి నిలువెల్లా కంపించి పోసాగింది లావణ్య. అంతవరకు వున్న ఆమె సహనం సడలిపోయి, ఒక బొమ్మగా మారి పోయింది. అక్కడెవరూ ఆమెకు కనిపించలేదు ....నాగార్జున రూపంలో ఉన్న కృష్ణ తప్ప! ఆమె కళ్ళ ముందు మరో ప్రపంచం నిలిచింది. తనని తానే మరచిపోతున్నది.

నాగార్జున తన వైపుగా వస్తున్న లావణ్యాను చూడలేదు.

పరధ్యానంగా నడుస్తున్న కూతుర్ని దూరన్నుంచి గమనించిన శ్రీనివాస రావు, దగ్గరకు వచ్చేలోగా జరిగి పోయింది.

అందరూ ఆమెను చూశారు. నాగా ర్జునకు ఏమి తోచడం లేదు. లావణ్య అతని పాదాల పై వాలిపోయి, తన రెండు చేతులతో అతని మోకాళ్ళ చుట్టూ గట్టిగా చుట్టింది. ఆ చేతులు వీడని బంధంలాగ పెన వేసుకున్నాయి.

ఎంతో ప్రయత్నం మీద చేతులు విడదీసి, ఆమెను ఇంటికి చేర్చారు. నాగార్జున 'పల్స్' చూసి.... ఇంజెక్షన్ ఇచ్చాడు.

బహుశ ఆమె తెల్లవారేసరికి కోలుకోవచ్చు. ఈసారి ఆమెను హస్పటల్‌కు తీసికెళ్ళి టెస్టులు చేసి.... అంతా.... తెలుసుకుందాం అని శ్రీని వాస రావుతో చెప్పి ఇంటికి చేరు కున్నాడు.

## 65

విశాల.... తన వీల్ చేర్‌ను వెనక్కు తిప్పకుంటూండగా నాగార్జున కనిపిం చాడు. ఆమె వీల్ చేర్ మీద చేతు లుంచి... "విశాలా.... కొది సేపు అలా వెన్నెల్లో కూర్చుందామా ?'' అని అడి గాడు.

సరే అన్నట్లు తలూపింది విశాల ఒక్కతే.... వుండేందుకు ఒప్పుకుంది. అదీ రెండు రోజులే.

పాల వెన్నెల ఆ వెన్నెలకు విర బూసిన మల్లెలు, ధవళ కాంతులతో బాటు సువాసనలు వెదజల్లుతున్నాయి.

ఆమె కూర్చున్న వీల్ చేర్ ఎదు రుగా కుర్చీలో కూర్చున్నాడు. నాగా ర్జున. ఆమెను పరిశీలనగా చూశాడు. మునుపటికన్నా కొంచెం చిక్కివుంది. వదనంలో ఆనంద రేఖలు లేకున్నా, ఆ కళ్ళల్లో ఏదో ధైర్యం తొణ కిసలాడుతోంది. "విశాలా" పిలిచాడు నాగార్జున.

ఆమె తలెత్తి చూసింది.

కొద్దిసేపు.... మౌనంగా గడచింది.

"నేను మీ గురించి చాలా ఆలోచించాను" అంది మౌనాన్ని భేదిస్తూ.

"ఏమని....?" అడిగాడు కుతూహలంగా.

"ఒకరి కోసం.... ఒకరు తమ జీవితాన్ని ఎడారిగా మార్చుకోవటం నాకు ఇష్టం లేదు. మిమ్మల్ని నేను ఎంతగానో ఆరాధించాను. కాని, ఆ ఆరాధన నాకు వేదననే మిగిల్చింది. ఆ వేదనకు పరిహారం.... మీ చేతుల్లో వుంది."

"ఏమిటది ?"....

"మీరు వివాహం చేసుకోవాలి. మీ భవిష్యత్తు సుఖ శాంతులతో నిండితేనే నాకానందం. ప్లీజ్, మీరు పెళ్లి చేసుకోండి".... అలా చెపుతున్న ఆమెను నింపాదిగా చూశాడు నాగార్జున.

ఆ వెన్నెలలో పాలరాతి బొమ్మలా వుంది విశాల. పిల్లతెమ్మెర ఒకటి వచ్చి, ఆమె ముంగురులను సవరించినట్టు సుతారంగా నుదిట మీదకు నెట్టి, తరలిపోయింది. ఆ చిరుగాలికి కదలే ఆ కురులు.... ఆమెకు మేలిముసుగులా వున్నాయి. ముంగురులను సవరించుకోవాలని చూసింది. ఆ నిండు వెన్నెల మాదిరే ఆమె మనసూ నిండుగా వుంది.

"విశాలా, నాసుఖం కోసం నీకు తోచిన సలహా చెపుతున్నావు.... నా మనసు తెలుసుకోగలిగావా....?"

ఆ ప్రశ్నకు ఆమె కనులు చిలికించి చూసింది.

'మనం శారీరకంగా కాకపోయినా, మనసులో ఎప్పుడో బందీలం అయినాము. హృదయాలు ఏకమైనప్పుడే మనం సంపూర్ణ దంపతులమయాము. ఒకవేళ మన వివాహానంతరం ఇలా జరిగివుంటే....?"

"అప్పుడుకూడా మీ జీవిత సౌఖ్యం కోసం ఇలాగే చెప్పివుండేదాన్ని".... అంది విశాల.

"ఒకవేళ.... ఈ యాక్సిడెంట్ నాకే జరిగివుంటే.... ?"

ఆమె తడబడింది. కనులు రెపరెప లాడాయి. అధరాలు అసహనంగా కదిలాయి. అలా మాట్లాడవద్దని వారించా లనిపించింది.

"చూశావా ఆమాటనే నీవు ఓర్చుకోలేకపోతున్నావ్.... అనాదిగా ఆడవాళ్ళు అబలలే కాదు.... త్యాగమూర్తులు కూడా. భర్తల సుఖాన్ని ఆశించేవారు పుణ్యవతులు. వాళ్ళలో ఏ లోపమున్నా, పిల్లలు.... కలుగకున్నా భర్తలకి పెళ్ళిళ్ళుచేసి కంటతడి తుడుచుకుని, సంతోషించే త్యాగమయులు. తన సౌఖ్యాన్ని, తన సంతోషాన్ని, మగవాడికి ధారబోయగల స్త్రీ సహనశీలి, ఆదర్శ నారీమణి - అని బిరుదులు పొందింది. ఆ బిరుదులు ఆమె నొసట రుద్ది, తీరని అన్యాయాన్ని తలపెడుతుందీ ప్రపంచం. తన సర్వస్వాన్ని దోచివ్వగల, స్త్రీ కోసం, పురుషుడు మారాలి.... ఆమెకు ఆపద కలిగినపుడు కనుసన్నల్లో పెట్టుకొని పూజించాలి, పురుషుడ్ని స్త్రీ ఆరాధిస్తుంది. (ఇంకా వుంది

JAGATI Telugu Monthly ... Edited, Printed and Published by NR Chendur at MANASA PRESS, No 2 Kutchery Road, Mylapore, Madras 600 004